## విశేష 'ప్రజాదరణ' పొందిన మా ప్రచురణ

యర్రా సత్యనారాయణ, BSc, BEd గారి...

| పుస్తకం | వెల |
|---|---|
| లేటెస్ట్ జనరల్ నాలెడ్జ్ | 15/- |
| క్విజ్ పవర్ | 15/- |
| కాంజుగేషన్ ఆఫ్ వెర్బ్స్ డిక్షనరి | 15/- |
| కామన్ ఎర్రర్స్ | 12/- |
| వంటలు-పిండి వంటలు | 15/- |
| జోక్స్ వరల్డ్ | 10/- |
| ఎ డిక్షనరి ఆన్ ఎడ్జెక్టివ్స్ | 15/- |
| లెర్నర్స్ డిక్షనరి | 12/- |
| "స్పీడెక్స్" ఇంగ్లీష్ స్పీకింగ్ కోర్స్ | 12/- |
| జనప్రియ "ఆంగ్లభాష" | 15/- |
| ఆర్టికల్స్ (A, An & The) | 12/- |
| స్వయం ఉపాధి (కుటీర పరిశ్రమలు) | 15/- |
| 'నవభారత్' G.K. | 10/- |
| 'ఇన్నోవేటివ్' ఇంగ్లీష్ గ్రామర్ | 12/- |

అన్నవరపు కుమార్, MA, MPhil, BL, PGDPR, PhD గారి...

| పుస్తకం | వెల |
|---|---|
| S.S C. (క్లర్క్స్ గ్రేడ్) ప్రీవియస్ & గెస్ పేపర్స్ | 12/- |
| A.P.P.S.C గ్రూప్ - 1 ప్రీవియస్ & గెస్ పేపర్స్ | 12/- |
| B.S.R.B. (R.R.B.) ప్రాక్టీస్ పేపర్స్ | 25/- |
| B.S.R.B. (P.S.Bs) గెస్ పేపర్స్ | 18/- |

N. కరుణాకర్, MA గారి...

| పుస్తకం | వెల |
|---|---|
| ★30 రోజులలో... ఇంగ్లీష్ నేర్చుకోండి! | 12/- |
| ★30 రోజులలో... ఇంగ్లీష్ గ్రామర్ | 12/- |

P. నాగేంద్ర ప్రసాద్, BSc, BEd గారి...

| పుస్తకం | వెల |
|---|---|
| ఇన్ఫర్మేటివ్ ఇంగ్లీష్ గ్రామర్ | 12/- |
| AP హిస్టరీ స్పెషల్ క్విజ్ బిట్స్ | 10/- |
| క్విజ్ 'ఇండియా' | 10/- |
| పరీక్షలు-ప్రథమ శ్రేణి | 10/- |
| ★చక్కని ఇంగ్లీష్ వ్రాయడమెలా? | 10/- |
| ★త్రిభాషా డిక్షనరి (తెలుగు-ఇంగ్లీషు-హిందీ) | 12/- |
| ★Learner's G K. | 10/- |
| ★గార్డెనింగ్ | 10/- |

యర్రు కృష్ణార్జునరావు, BCom గారి

| పుస్తకం | వెల |
|---|---|
| లాలీ జోక్స్ | 8/- |

వెల్లూరి సీతారామేశ్వరరావు, BCom గారి...

| పుస్తకం | వెల |
|---|---|
| ★నాటి మానవులే- నేటి దేవతలా.! | 20/- |
| ★పుట్టుమచ్చల శాస్త్రము | 10/- |
| ★శరీరము - వ్యాధులు | 12/- |
| ★రాశులను బట్టి.. మీ శృంగార జీవితం | 12/- |
| ★"తేనె" తో చికిత్సలు | 6/- |

శ్రీమతి Ch. శిరీష గారి....

| పుస్తకం | వెల |
|---|---|
| ★"చికెన్"తో వంటకాలు | 6/- |
| ★"ఎగ్"తో వంటకాలు | 6/- |
| ★"ఫిష్"తో వంటకాలు | 8/- |

S. నాగేంద్రపరవాసరావు, MA, BEd గారి..

| పుస్తకం | వెల |
|---|---|
| మెంటల్ ఎబిలిటి | 12/- |

అడుసుల రామయాచారి, POL గారి....

| పుస్తకం | వెల |
|---|---|
| ★తెలుగుపద ప్రయోగాలు (దోషములు - నివారణలు) | 15/- |
| ★ గృహ వైద్యసారము | 10/- |
| ★ ఆయుర్వేద పానీయాలు | 10/- |

**★ స్టార్ మార్కు ఉన్నవి స్టాక్‌లో లేవు. స్టార్ మార్కు లేనివి మాత్రమే స్టాక్‌లో ఉన్నవి.**

గమనిక: పై వాటిలో మీకు కావలసిన పుస్తకాల ఖరీదును క్రింది అడ్రసుకు M.O. చేయండి! పైకము మాకు అందగానే సదరు పుస్తకాలను కేవలము Rs.1-00కి V.P.B.P లో పంపగలము. ఉత్తర-ప్రత్యుత్తరాలకు రిప్లైకార్డ్ తప్పక వ్రాయాలి. M.O.కూపన్‌లో కావలసిన పుస్తకాల పేర్లు, అడ్రస్ స్పష్టముగా వ్రాయాలి. ఆంధ్ర ప్రదేశ్‌లోని అన్ని R.T.C బస్‌స్టేషన్ బుక్ స్టాల్స్‌లోనూ, రైల్వే స్టేషన్స్‌లోని హిగ్గిన్ బాథమ్స్ మరియు ప్రైవేట్ బుక్ స్టాల్స్‌లోనూ మా ప్రచురణలన్నీ లభించును.

**జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి - 522 201. Phone No. 23037**

Cont . 3rd Cove

# అతీత శక్తులు - అద్భుత వాస్తవాలు



సేకరణ :

**లక్కరాజు రమేష్‌బాబు,**

28-17-27, రామమందిరం ఎదురువీధి,

అరండల్ పేట, విజయవాడ-2.





Phone No. 23037




**జనప్రియ పబ్లికేషన్స్**

అగ్నికుల క్షత్రియుల వారి వీధి,

గంగానమ్మ పేట, తెనాలి - 522 201.

# ATEETA SAKTULU-
# ADBHUTA VASTAVALU

By : Lakkoju Ramesh Babu


| ముద్రణ : | Edition : |
| --- | --- |
| డిసెంబర్, 1995. | December, 1995. |
| అన్ని హక్కులు : - జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి-వారివి. | All rights reserved by: Janapriya Publications- Tenali. |
| వెల : రూ॥ 10-00. | Price: Rs. 10.00. |
| ముఖచిత్రము : L. రమేష్‌బాబు, విజయవాడ-2 | Cover Design : L. Ramesh Babu, Vijayawada-2. |
| ముద్రణ : డి. బి. ప్రింటర్స్, రామమందిరం ఎదురువీధి, విజయవాడ-520 002. | Printed at : D. B. Printers, Opp. Ramamandiram St, Vijayawada 520 002. |
| ముఖచిత్ర ముద్రణ : సౌందరమ్ ప్రింటర్స్, మద్రాస్-21. | Cover Printers : Soundaram Printers, Madras-21. |

ప్రతులకు : Phone : 23037 For Copies :

JANAPRIYA PUBLICATIONS,
Agnikula Kshatriyula vari Street-II,
Ganganamma Pet, TENALI-522 201

# విషయసూచిక

# ముందుమాట

"అతీత శక్తుల"కు భారతదేశము నిలయమని చాలామంది విదేశీ పరిశోధకులు వ్యాఖ్యానిస్తుంటారు కొంతమంది శాస్త్రజ్ఞులు ఈ విషయముపై ఎన్నో పరిశోధనలు జరిపారు....ఎంతోమంది అతీంద్రియశక్తులు సంపాదించిన వారిని ముఖాముఖీగా పరిశీలించారు. వారు సృష్టిస్తున్న అద్భుతాలను చూచి ఆశ్చర్యపోయారు. కానీ.... అతీత శక్తులున్నాయని శాస్త్రీయపరమైన నిరూపణలు మాత్రము ఇప్పటివరకూ ఎవరూ చేయలేకపోయారు. ఇదే విషయమును అతీత శక్తులు సాధించినవారిని అడిగితే 'సైన్స్‌తో మాకేమిటి-మాశక్తులను నిరూపించవలసిన అవసరము మాకేమి లేదు' అంటున్నారు

మానవులు అతీత శక్తులను సాధించవచ్చుననే శాస్త్రీయనిరూపణ ఇప్పటివరకూ లేనందున....చాలామందికి ఇది ఎటూ తేలని విషయముగా వుండిపోయింది. కొంతమంది విజ్ఞానవంతులు 'అతీత శక్తులున్నాయని, వాటిని సాధించడము అనేవి భూటకాలని కొన్ని మాయలు నైపుణ్యముతో ప్రజలను మోసము చేస్తున్నారని భావిస్తున్నారు

శ్రీలంకకు సంబంధించిన అత్యంత విద్యావంతుడు డా॥కోవూర్ అతీత శక్తులతో అద్భుతాలు సృష్టించేవాళ్ళందరూ మోసగాళ్ళని.... ఇవి కేవలము మేజిక్స్ మాత్రమేనని- తనూ కొన్ని అద్భుతాలను ప్రసంగ వేదికలపై చేసి చూపించాడు. ప్రపంచ ప్రఖ్యాత మెజీషియన్ హేరిహౌడిని తను బ్రతికున్నంత కాలమూ ఎటువంటి శక్తిసంపన్నుడైనా తన ఎదురుగా వారి శక్తులను ప్రదర్శిస్తే వారి మాయలను బయట పెడతానని లక్షరూపాయలు పందెము ప్రకటించాడు. కానీ ఎవరూ రాలేదు.

ఇటువంటి ఎన్నో విషయాలను వివరిస్తూ....ఎన్నో పుస్తకముల లోని వ్యాసముల ఆధారముగా ఈ "అతీత శక్తులు-అద్భుత వాస్తవాలు" రూపొందించుట జరిగినది ఇందులో శాస్త్రీయ నిరూపణలు, నిజానిజాలు ఎవరికీ అంతుబట్టుటలేదు కాబట్టి....ఆ విషయాన్ని వదిలి పెట్టి చదివేవారికి ఆసక్తికరముగా వుంటుందని భావిస్తున్నాము తమ అమూల్య అభిప్రాయాలను తెలియజేయగలరని కోరుతూ మీ....

లక్కోజు రమేష్‌బాబు
రచయిత

# అతీత శక్తులు-
# అద్భుత వాస్తవాలు

## పక్షికి ప్రాణము పోసిన స్వామి విశుధానంద!

పవిత్ర నదీజలాల సంగమ ప్రదేశమే వారణాసి.... అదే 'కాశీ'. కాశీకి వెళ్ళి అక్కడ ఆ పవిత్ర జలాల్లో మునిగి వస్తే సర్వపాపాలు తొలిగి పోతాయని, సర్వరోగాలనుండి విముక్తి కలుగుతుందని భారత దేశంలో ఎంతోమంది ప్రజలు నేటికీ నమ్ముతున్నారు

ప్రతిరోజూ కొన్ని లక్షలమంది యాత్రికులు సందర్శించే ఈ మహత్తర ప్రదేశములో, ఒక ప్రశాంత వాతావరణములో విశాలమయిన ఆశ్రమములో వుంటున్నారు స్వామి విశుధానంద.

ఆశ్రమములో ఎంతోమంది శిష్యులుంటారు. అందరూ ఎంతో విజ్ఞానవంతులు, ఉన్నత వ్యక్తులే! వారిలో పండిట్ 'కవిర్జ్' ముఖ్యులు. ఈయన వారణాసిలోని ప్రభుత్వ సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్

స్వామి విశుధానందను చూడటానికి వచ్చే విదేశీయులకు, ఇతర గౌరవ వ్యక్తులకూ పండిట్ కవిర్జ్ అక్కడి ఆశ్రమములో ప్రత్యేకమైన వసతులు కల్పిస్తారు

స్వామి విశుధానంద చాలా సంవత్సరాలుగా అక్కడే వుంటు న్నారు ఎంతకాలం నుంచీ అక్కడ వుంటున్నారు?.... అతని వయ స్సెంత? అన్నది ఎవ్వరికీ తెలియని విషయము.

స్వామి విశుధానంద అతీత శక్తుల గురించి విన్న యూరోపియన్ దేశస్థుడు 'పాల్ బ్రన్టన్' స్వామియొక్క అద్భుత శక్తులను ప్రత్యక్ష ముగా చూడాలని, పరిశోధించాలని వారణాసి చేరుకున్నాడు.

వారణాసి చేరుకున్న పాల్‌బ్రన్టన్‌కు అక్కడ లక్షలాది యాత్రి

కులను చూడగానే ఆ ప్రదేశముయొక్క పవిత్రత అర్థమైంది. అక్కడి నుండి స్వామి విశుధానంద ఆశ్రమాన్ని చేరుకున్నాడు.

ఆశ్రమ ముఖద్వారము దగ్గిర కాపలావున్న శిష్యుడొకరు పాల్ బ్రన్టన్ వచ్చిన వివరాలు తెలుసుకుని, లోపలకువెళ్ళి పండిట్ కవిర్జను వెంటబెట్టుకొచ్చాడు.

పండిట్ కవిర్జ్ పాల్ బ్రన్టన్ వివరాలు తెలుసుకుని ఆశ్రమము లోనికి తీసుకెళ్ళి స్వామివిశుధానంద శిష్యులకు బోధనలు చేస్తున్న గదిలో కూర్చోబెట్టాడు.

స్వామి విశుధానంద బోధనల అనంతరము— పాల్ బ్రన్టన్ పండిట్ కవిర్జ్‌తో.... తను స్వామిని ప్రత్యేకముగా కలవాలని, అతని మహత్తర శక్తులను కళ్ళారా చూడాలనీ....అందుకు అవకాశము కల్గించమని కోరాడు

పండిట్ కవిర్జ్ పాల్ బ్రన్టన్‌కు మరునాడు ఉదయాన్నే స్వామి విశుధానందను దర్శించే ఏర్పాటు చేసాడు.

పండిట్ కవిర్జ్- పాల్ బ్రన్టన్ వచ్చిన వివరములను స్వామి విశుధానందకు తెలియజేసాడు.

స్వామి చిరునవ్వుతో పాల్ బ్రన్టన్‌ను ఆశీర్వదించి, ఎదురుగా కూర్చోమన్నారు. వారిద్దరిమధ్యన సంభాషణలను పండిట్ కవిర్జ్ అనువదించి చెపుతున్నారు-

"సైన్స్‌కు అందని మీ అతీత శక్తుల గురించి నా మిత్రుల ద్వారా తెలుసుకున్నాను. అటువంటి శక్తులను నా కళ్ళతో చూస్తేగాని నమ్మలేనని ప్రత్యేకముగా ఇక్కడకు వచ్చాను" అన్నాడు పాల్ బ్రన్టన్.

"అతీంద్రియ శక్తులనేవి అడగగానే ప్రదర్శించడానికి సాధన చేసినవికాదు....ఆయా సందర్భాలను బట్టి నేను అనుకున్న వెంటనే అవి జరుగుతుంటాయి. సాధారణముగా మా దేశములోని వారెవరూ ప్రత్యేకముగా 'శక్తులను ప్రదర్శించండి' అని అడగరు. ఎక్కువగావిదేశీయులే నన్ను ప్రత్యేకించి వత్తిడి చేస్తారు. అంత దూరమునుండి ప్రత్యేకించి వచ్చిన వారిని నిరుత్సాహ పరచడము ఇష్టంలేక 'అతీతశక్తులున్నా

యని, యోగ సాధనద్వారా వాటిని పొందటం సాధ్యమనీ' మీకు తెలియ జేయడానికే నేను కొన్ని ప్రదర్శించి చూపడము జరుగుతుంది.... మీకేం కావాలి?" అంటూ ప్రశ్నించారు స్వామి విశుధానంద.

పాల్ బ్రన్‌టన్ సంతోషముతో రెండు నిమిషాలు ఆలోచించి 'పారిస్' జాస్మిన్ సెంట్ సువాసనను చూపించండి మాస్టర్ అని అడిగాడు.

"మీ చేతి కర్చీఫ్ ఇలా యివ్వండి" అడిగారు విశుధానంద.

పాల్ బ్రన్‌టన్ వెంటనే జేబులోనుండి హేండ్ కర్చీఫ్ తీసి స్వామి చేతికి అందించాడు.

స్వామి విశుధానంద కర్చీఫ్‌ను నాలుగు మడతలుగా మడిచి ఆ కర్చీఫ్ ఒక మూలన తన చేతిలో వున్న భూతద్దంలోంచి తీక్షణంగా ఒక్క నిమిషం చూశాడు.

కర్చీఫ్‌కు అక్కడ చిన్న రంగుచుక్క ఏర్పడింది. వెంటనే ఆ గదంతా పారిస్ జాస్మిన్ సెంట్ సువాసనలు వెదజల్లాయి. కర్చీఫ్‌ను పాల్ బ్రన్‌టన్ చేతికి అందించారు.

బ్రన్‌టన్ కర్చీఫ్ నుండి ఆ సువాసనను చూసి ఆశ్చర్య పోయాడు అలాగే.... కర్చీఫ్‌మీద గులాబీ సెంట్ వాసన, చందనపు సెంట్ వాసన కావాలని అడిగాడు.

హేండ్ కర్చీఫ్‌కు మరో రెండు మూలల అటువంటి వాసనలనే సృష్టించారు స్వామి విశుధానంద.

పాల్ బ్రన్‌టన్ ఆశ్చర్యానికి అంతులేదు.... భారతదేశంలో.... వారణాసిలో... ఎక్కడోవుండే పారిస్ జాస్మిన్ సెంట్ వాసనలు అనుకున్న క్షణములోనే ఇక్కడ వెదజల్లడమేమిటి?.... అనుకుంటూ కొంచెము సేపు ఆలోచనల్లో పడిపోయాడు.

అంతలో ఒక పక్షి గది కిటికీలోంచి అసహనంగా ఎగరలేక.... ఎగరలేక ఎగురుతూ వచ్చి గదిలో ఓ మూలపడి కాసేపు గిలగిలా కొట్టు కుని ప్రాణాలు వదిలింది.

దాన్ని చూడగానే పాల్ బ్రన్‌టన్‌కు మరో ఆలోచన కలిగింది.

"మాస్టర్.... ఈ పక్షికి ప్రాణము పోయగలరా మీ శక్తితో" అడిగాడు.

"ఎందుకు సాధ్యము కాదు– అయితే ప్రకృతి శక్తికి విరుద్ధంగా అతీత శక్తులను ఉపయోగించకూడదు. మీ కోరిక కోసం కొంచెము సేపు తాత్కాలికముగా ఆ పక్షికి ప్రాణము పోస్తాను. పక్షిని తీసుకురండి" అన్నారు.

పాల్ బ్రన్‌టన్ మూలన పడున్న పక్షిని తీసుకున్నాడు. దాన్ని పూర్తిగా పరీక్షించాడు. సందేహమేలేదు. అది చనిపోయింది. పక్షిని స్వామి ఎదురుగా వున్న బల్లమీద వుంచాడు.

స్వామి విశుధానంద తన చేతిలోవున్న భూతద్దముద్వారా కొంచెం సేపు తీక్షణంగా పక్షిని చూసాడు ముందు అది ప్రాణం వున్నట్లుగా కదిలింది. తర్వాత రెక్కలను ఆడించింది. ఆ తర్వాత లేచి ఎగురుకుంటూ గదిలో రెండుసార్లు తిరిగింది. మళ్ళీ మామూలుగా అసహనమై పోయి క్రిందపడి ప్రాణాలు వదిలింది.

ఇది యింకా ఆశ్చర్యమేసింది జాన్ బ్రన్‌టన్‌కు స్వామి విశుధానంద అతీత శక్తులమీద పూర్తి విశ్వాసం కలిగింది.

పాల్ బ్రన్‌టన్ ఇంకా ఏదో అడగబోతుండగా పండట్ కవిర్జ్ ఇక వద్దని వారించాడు

స్వామి ఆశీర్వాదము తీసుకుని పాల్ బ్రన్‌టన్, పండిట్ కవిర్జ్ అక్కడనుండి బయటికొచ్చారు

పాల్ బ్రన్‌టన్, స్వామి విశుధానంద జీవిత విషయాలను చెప్పవలసిందిగా పండిట్ కవిర్జ్‌ని కోరాడు.

స్వామి విశుధానంద చిన్నప్పుడు.... పదేళ్ళ ప్రాయములో పాము కాటువలన దాదాపుగా చనిపోయే పరిస్థితిక చేరుకోగా, ఆశ వదులుకున్న తల్లిదండ్రులు అతన్ని నదీతీరానికి తీసుకొచ్చి, నదిలో ముంచి తేల్చి భగవంతునిమీద భారము వేసారు.

అక్కడే వుండి అన్నీ చూస్తున్న ఒక ముసలి స్వామి వారిని దగ్గరకు రమ్మని పిలిచి తన దగ్గరుండే ఆకులను పిండి ఆ పసరును

పాము గాటు పడిన చోట రుద్దాడు. రెండు నిమిషాల్లో విశుధానంద ఆరో
గ్యముగా లేచి నిలుచున్నాడు.

ఆ తర్వాత విశుధానంద ముఖకవళికలను ముసలి స్వామి బాగా
గమనించి, తన శిష్యుడిగా తనతో పంపమని విశుధానంద తల్లిదండ్రు
లని కోరాడు.

విశుధానందకు ప్రాణంపోసిన ఆ స్వామి ఎంతో మహత్తరమైన
వ్యక్తిగా భావించి ఆ తల్లిదండ్రులు విశుధానందను అతనితో పంప
డానికి ఒప్పుకున్నారు.

ఆ తరువాత ముసలిస్వామి తనతో పాటు విశుధానందను టిబెట్
అడవుల్లోకి తీసుకెళ్ళినట్లు, దాదాపు ముప్పై సంవత్సరాలపాటు టిబెట్
అడవుల్లోనే యోగసాధనచేసి తిరిగి వచ్చినట్లు స్వామి విశుధానంద నాతో
చెప్పారు.... ఇదీ విశుధానంద జీవితము. కొంతకాలం శిష్యులకు యోగ
నేర్పించే స్కూల్ నడిపారు ఇప్పుడు అదీ లేదు ప్రశాంతముతో దైవ
జ్ఞానములో గడుపుతున్నారు" అంటూ చెప్పాడు పండిట్ కవిర్జ్.

పాల్ బ్రన్టన్ తన అపూర్వ అనుభవానికి సంతోషాన్ని
వ్యక్తంచేస్తూ సహకరించినందుకు పండిట్ కవిర్జ్‌కు కృతజ్ఞతలు తెలియ
జేసి వెళ్ళిపోయాడు.

తరువాత పాల్ బ్రన్టన్ కొన్ని అతీత శక్తులమీద తన అనుభ
వాలను పుస్తకరూపములో తీసుకొచ్చాడు.

"అతీత శక్తులను పొందటము అందరికీ సాధ్యముకాదు, ఎందు
కంటే మానవ సహజమైన వాటిని ఎన్నో త్యజించి చిత్తశుద్ధితో యోగ
సాధన కార్యదృష్టితో కాలాన్నే మర్చిపోవాలి, చిత్తశుద్ధిలో ఏ మాత్రము
లోపమున్నా వాటిని పొందటము సాధ్యముకాదు"

—స్వామి విశుధానంద.

# గోడలోనుండి నడచి వచ్చుట సాధ్యమా—?!

ప్రపంచములో ప్రఖ్యాత మెజీషియన్లందరిలోనూ హీరోలాంటి వాడు 'హేరీ హౌడినీ'

అమెరికాకు చెందిన హేరీ హౌడిని చేసే మేజిక్‌లు చూస్తుండే వారు, సంభ్రమాశ్చర్యాలతో నోరావళించుకునే వుండిపోయేవారు. సాటి మెజీషియన్లు సైతం 'ఆ మేజిక్స్ ఎలా చేయగలుగుతున్నాడా?' అనుకుంటూ ఆలోచనలతో బుర్రలు బ్రద్దలు కొట్టుకునేవారు

హేరీ హౌడిని చేసే మేజిక్స్‌లో ఇనుప గొలుసులను సైతం క్షణములో విడదీసుకుని బంధవిముక్తుడు కావటం, ప్రదర్శన చివరిలో గోడలోనుండి ముందుకు నడుచుకు రావడము—

ఈ మేజిక్స్ రెండూ ఎలా సాధ్యమా అనేది ఇప్పట్టివరకూ ఎవరికీ అంతుబట్టని విషయము.

కొంతమంది మెజీషియన్‌లు ఈ మేజిక్స్ అర్థముగాక 'ఇవి మేజిక్స్ కావని హౌడినీలో అతీత శక్తులున్నాయని, ఆ శక్తుల ఆధారముతోనే యిటువంటి అద్భుతాలు సాధ్యమనీ' అంటుండేవారు

అయితే హౌడినీ మాత్రము తను చేసేవి కేవలము మేజిక్స్‌నని, ఎవరయినా ప్రయత్నిస్తే చేయగలిగేవే అనీ, తనకు అతీత శక్తులంటూ ఏమీలేవని, అస్సలు ఏ మనిషికీ అతీత శక్తులంటూ లేనేలేవనీ, అతీత శక్తుల పేరుతో మేజిక్స్‌చేస్తూ మోసము చేస్తున్నారని... ఎవరయినా సరే అతీత శక్తులున్నాయని వచ్చి తన ఎదురుగా నగ్నంగా వుండి ఏ ఒక్క అతీత శక్తినయినా చేసి నిరూపిస్తే తను సంపాదించింది మొత్తము వాళ్ళకి వ్రాసిచ్చేసి తన మేజిక్ ప్రదర్శనలు విరమించుకుంటానని ప్రతీ వేదికమీద ఛాలెంజ్ చేసేవాడు

అయినా సరే అతీత శక్తులున్నాయనేవారు హౌడినీ బ్రతికున్నంతవరకూ అతని ఎదురుగా వెళ్ళి నిరూపించటానికి ముందుకు రాలేకపోయారు.

మేము మహానుభావులమని, అతీత శక్తులున్నాయని ఆ శక్తులను ప్రదర్శించేవారు చేసేవన్నీ హేరీ హౌడినీ మేజిక్ ప్రదర్శనల్లో చేసి చూపించి-"నేను మహానుభావుడ్ని కాదు-మామూలు మీలాంటి మనిషినే" అనేవాడు.

హేరి హౌడినీ తన ప్రత్యేక మేజిక్ ప్రదర్శనగా ముందు "ఎస్కేప్ టెక్నిక్" అనేదాన్ని సాధనచేసి న్యూయార్క్‌లో మొదటి సారిగా ప్రదర్శించి అందర్నీ ఆశ్చర్యపరిచాడు.

ఈ ప్రదర్శనలో....ఒక ఖాళీ బీరు డ్రమ్ములో తనను పెట్టి మూతవేసి తాళము వేయగా, దాన్ని చాలామంది పరిశీలించి, నిజంగానే తాళము వేశారు ఇక మూత తెరవడము సాధ్యము కాదని నిర్ధారించిన తరువాతనే, సరిగ్గా ఇరవయ్ సెకండ్లలో హౌడినీ డ్రమ్ముమూత తీసుకుని బయటకు వచ్చేవాడు. ఈ మేజిక్ ఎలా సాధ్యమా అని అందరూ ఆశ్చర్యపోయేవారు.

ఈ ప్రదర్శనతో సంచలనము కలిగింది. ఇది తెలిసిన చికాగో పట్టణములోని పోలీసులు హౌడినీ మేజిక్‌ని పరీక్షించాలనిపిలిపించి, వారి పోలీసు హెడ్ క్వార్టర్స్‌లో హౌడినీ రెండు చేతులకూ బేడీలు తగిలించి తాళాలు వేసి 'విప్పుకో చూద్దాము' అన్నారు.

అలా అనేసి పోలీసులు గర్వంగా ఒకరి ముఖాలొకరు చూసుకుని, తిరిగి హౌడినీవేపు చూసేసరికల్లా బేడీలు-తాళాలు విడిపోయి క్రిందపడి వున్నాయి అంతవరకూ గర్వంగా నవ్వుకున్న పోలీసుల ముఖాలు క్షణంలో మాడిపోయాయి

ఆ తర్వాత 1899వ సంవత్సరములో శాన్ ఫ్రాన్సిస్కోలోని పోలీస్ డిపార్టుమెంట్ హౌడినీని ఛాలెంజ్ చేశారు, హౌడినీ అందుకు ఒప్పుకుని వచ్చాడు

పోలీస్ హెడ్ క్వార్టర్సులో హౌడినీని పూర్తిగా పరీక్షించి, అతని దగ్గర ఎటువంటి ఆధారాలు లేవని నిర్ధారించుకుని, హౌడినీని ఒక స్థంభానికి వీపు ఆనించి, చేతులను వెనక్కు లాగికట్టి, ఆ చేతులకు పది జతల బేడీలువేసి, కాళ్ళను గొలుసులతో బంధించారు.

ఎంతోమంది పత్రికా విలేఖరులు, డిటెక్టివ్‌లూ ఆ ప్రదేశానికి వచ్చారు. హౌడినీని అలా బంధించి, పోలీసులు, తతిమ్మావారూ ఆ గది లోంచి బయటకొచ్చి తలుపులు తాళాలు వేసి-అయిదు నిమిషాల తరువాత గదిలోకి వెళ్ళొచ్చుననుకున్నారు.

కానీ మూడు నిమిషాలయినా కాకుండానే హౌడినీ గది తలుపుల తాళముకూడా తననేమీ చేయలేదన్నట్లు తలుపులు తీసుకుని బయటికి వచ్చాడు ఒక్కక్షణము అందరిమతులూ చెడిపోయాయి. గదిలో స్థంభము దగ్గర చూశారు. చేతులకు వేసిన బేడీలు, కాళ్ళకు బంధించిన ఇనుప గొలుసూ క్రిందన పడున్నాయి

పత్రికా విలేఖరులు, ఫోటోగ్రాఫర్‌లూ, డిటెక్టివ్‌లూ హౌడినీపట్ల ప్రశంసల వర్షము కురిపించారు 'ఇది నిజముగా అత్యద్భుతము' అన్నారు దాంతో హౌడినీ పేరు ప్రపంచము మొత్తము మారుమ్రోగిపోయింది.

అయినా ఇది విన్న స్కాట్‌లాండ్ పోలీస్ సూపరింటెండెంట్ నమ్మలేకపోయాడు 1909 సంవత్సరములో హౌడినీని ఇంగ్లండుదోని స్కాట్‌లాండ్‌కు ఆహ్వానించాడు.

తనే స్వయముగా హౌడినీని పరీక్షించి, ఒక స్థంభాన్ని కౌగలించుకోమని, శరీరాన్ని పూర్తిగా ఇనప గొలుసులతో కట్టేసి, చివర్లకు తాళాలు వేసి, రెండు చేతులను కూడా కదలటానికయినా వీల్లేకుండా రెండు జతల బ్రిటిష్ బేడీలు వేసాడు

దాంతో తృప్తిపడిన పోలీస్ సూపరింటెండెంట్ వెటకారంగా 'ఇప్పుడేం చేస్తావ్.... ఈ సేపట్లో తిరిగొస్తా రెస్ట్‌తీసుకో' అంటూ వెనుదిరిగి వెళ్ళిపోగాడు.

పోలీస్ సూపరింటెండెంట్ అలా గది తలుపులవరకూ వెళ్ళాడో లేదో హౌడినీ తప్పట్లుకొట్టి పిలిచాడు.

వెనక్కి తిరిగి చూసిన పోలీస్ సూపరింటెండెంట్ అవాక్కయిపోయాడు. హౌడినీని కట్టిన ఇనుప గొలుసులూ, బేడీలు క్రిందన పడున్నాయి. చేతులను తిప్పుకుంటూ చిరునవ్వుతో నించుని వున్నాడు హౌడినీ.

పోలీస్ సూపరింటెండెంట్ ఆశ్చర్యానికి అంతులేదు. ఆనం దముతో హౌడినీ దగ్గరకువచ్చి కావలించుకుని హౌడినీ ప్రతిభను ఎంత గానో మెచ్చుకున్నాడు. హౌడినీకి వీడ్కోలు ఇచ్చేముందు ఎన్నో విలు వయిన బహుమతులు ఇచ్చాడు.

హౌడినీ ఈ మేజిక్‌ను చాలా దేశాల్లో ప్రదర్శించి 'హేండ్ కప్ కింగ్' అనే పేరు సంపాదించుకున్నాడు.

హౌడినీ మేజిక్ పేరు ప్రఖ్యాతులు తెలుసుకున్న రష్యాలో ఓ కోటీశ్వరుల కుటుంబము హౌడినీని ఆహ్వానించారు

అసలు విషయం ఏమిటంటే— ఆ కుటుంబములో దాదాపు పధ్నా లుగు సంవత్సరాలనుండీ తెరవడానికి వీలు లేకుండా, తాళము చెడి పోయిన ఇనుప భోషాణము వుంది.

ఎంతోకాలముగా మారు తాళాలు తయారుచేసేవారూ, తాళాలుతీసే నిపుణులూ ఎంతోమంది ప్రయత్నించి విసిగిపోయారు. ఆ ఇనుప భోషా ణములో దాదాపు పదిహేడు లక్షల విలువగల బంగారము, నగదు ఉండి పోయాయి.

ఆఖరి ప్రయత్నముగా హౌడినీని ఆహ్వానించి భోషాణముతాళాలు తీయవలసిందిగా కోరారు.

హౌడినీ సరిగ్గా తొమ్మిది నిమిషాల్లో భోషాణము తాళాలుతీసి అందర్నీ ఆశ్చర్యపరిచాడు. అందుకుగాను ఆ ధనవంతుల కుటుంబము హౌడినీకి సకల మర్యాదలూచేసి, అతనికి 750 డాలర్లు బహుమతిగా ఇచ్చి పంపారు.

హౌడినీ మేజిక్ ప్రదర్శనలో చివరి ప్రదర్శన అత్యద్భుత మైనది. అదే గోడలోంచి నడిచి రావటము!

ప్రదర్శననిచ్చే వేదికమీద మధ్యలో పదడుగుల విలువూ,అడ్డము వుండే అద్దాన్ని నించోబెట్టి, దానికి బేస్‌గా అటూ యిటూ ఇటుకలను పేర్చుతూ తాపీవారు గోడ కడతారు.

ఆ గోడకు అటూ ఇటూ నల్లటి కర్టన్లు కట్టబడి వేదిక సగము వరకూ మాత్రమే కనబడుతుంది.

గోడకు అవతలవేపునుండి హౌడినీ వేసే కేకలు వినే ప్రేక్షకులకు ఎక్కడో దూరమునుండి వినబడుతున్నట్టుగా వుండేవి. కాసేపటికల్లా హౌడినీ గోడలోంచి చేతులను ముందుకు చాచుతూ, నడుచుకుంటూ ముందుకు వస్తాడు. ఇపుడతని కేకలు దగ్గరనుండి వినబడుతుంటాయి.

గోడ చెక్కు చెదరకుండా అలాగే వుంటుంది! ఇదెలా సాధ్యము?

ఈ ప్రదర్శన అనంతరము ప్రేక్షకులు ఆనందముతో కరతాళ ధ్వనులు చేసేవారు. ఎంతోమంది మెజీషియన్లకూ్కడా యింతులో రహస్యము ఏమిటో అర్థమయ్యేదికాదు.

ఇలా హౌడినీ తన ముప్పయి సంవత్సరాల మేజిక్ పరిశోధనల్లో ఎన్నెన్నో అద్భుతాలను ప్రజలకు చూపించాడు. అతీతశక్తులంటూ ప్రజలను మోసాలుచేసి సంపాదించే ఎంతోమందిని పట్టుకొని, వారి భూటకాలను బయటపెట్టాడు.

హేరీ హౌడినీ 1926లో అక్టోబరు నెలలోని కెనడాలో మరణించాడు. అతని మరణము తర్వాతనయినా వ్రాసుకున్న డైరీ ప్రకారము కొన్ని అద్భుతాల రహస్యాలు తెలుస్తాయని చాలా మంది ఆశించారు.

కానీ హౌడినీ మాత్రం తన డైరీలో "ఈ రహస్యాలను నేను ఎవరికయినా తెలియజేస్తే వారు స్వార్థముతో ప్రజలను మోసగించోచ్చు. ఈ మేజిక్స్‌ను ఒక కళగా భావించాలేగానీ అతీతశక్తుల పేరిట ఉపయోగిస్తూ ప్రజలను మోసము చేయటము నేను సహించలేను. ఈ మేజిక్స్‌ను ఆసక్తి కలవారు ఎవరయినాసరే శ్రద్ధతో తెలివి తేటలతో సాధన చేస్తే చేయగలరు. ఇది నేను ప్రమాణపూర్తిగా చెపుతున్న విషయము ఇవి అతీతశక్తులు ఎంతమాత్రము కావు" అని వ్రాసుకున్నాడు.

హౌడినీ డైరీలో ఏ రహస్యాలయినా దొరుకుతాయనుకున్న వారికి నిరాశే ఎదురయింది.

ఇంతటి అద్భుత మెజీషియన్‌గా పేరు పొందిన హేరీ హౌడినీ అసలు పేరు "ఎరిచా వీజ్" 1874 మార్చి 24న హంగేరీలోని "యిడా వెస్ట్"లో జన్మించాడు. చిన్నతనంనుండీ మేజిక్స్‌మీద ఆసక్తితో స్వతహాగానే ప్రాక్టీస్ చేసేవాడు. అప్పటికే ప్రఖ్యాత మెజిషియన్‌గా పేరు పొందిన "రాబర్డ్ హౌడిన్" మీద గౌరవభావముతో తన పేరును "హేరీ హౌడిన్"గా మార్చుకున్నాడు.

"సైన్స్‌కు అందని అతీతశక్తులంటూ ప్రపంచంలో ఏ మనిషికీ లేవు. అతీతశక్తులుంటాయనేది నిజం కానే కాదు. అవి కేవలం మేజిక్స్ మాత్రమే! ఎవరయినా సరే అతీతశక్తులున్నాయని నా ఎదురుగా నగ్నంగా నిలబడి వారి శక్తులను నిరూపిస్తే నా సంపాదనంతా వారికే యిస్తాను. నేను మేజిక్ ప్రదర్శనలను విరమించుకుంటాను!"

— హేరీ హౌడిని

# దేన్నైనా సృష్టించగల సత్యసాయిబాబా!

మనదేశములో "పుట్టపర్తి" అనేది ఓ చిన్న ఊరు. మనవాళ్ళకే కాకుండా, ఎన్నో దేశాల్లో ఎంతోమందికి ఆ వూరు బాగా తెలుసు. అందుకు కారణము అది శ్రీ సత్యసాయిబాబా నివాస స్థలము కావటమే!

ఎన్నో దేశాల్లో లక్షలకొద్దీ భక్తులను కలిగి వున్నది ఏకైక వ్యక్తి సత్యసాయిబాబా మాత్రమే!

ఆయన శక్తులను, సేవలనూ కొంతమంది నమ్మి భగవంతుడిగా భావిస్తున్నా, కొంతమంది నమ్మక భూటకాలుగా తీసిపారేసినా శ్రీ సత్యసాయిబాబా మహోన్నత సేవా కార్యక్రమాలు నేటి ప్రజానీకానికి పుట్టపర్తిలో ప్రత్యక్ష సాక్షులుగా ఉన్నాయనడములో సందేహము లేదు!

గత నాలుగు దశాబ్దాలుగా ఎన్నో అపార్థాలకు, అభాండాలకు గురవుతూకూడా సత్యసాయిబాబా తదేక లక్ష్యముతో, ఓపికతో, ప్రజల

పట్ల కరుణతో విశ్వమానవ కుటుంబాన్ని నిర్మించాలనే తపనతో పుట్టపర్తిని రూపుదిద్దడము, అక్కడ ప్రపంచము గర్వించదగ్గరీతిలో నెలకొల్పిన హాస్పటల్, విద్యాలయము, మహాపట్టణాల విమానాశ్రయాలకు తీసిపోని విమానాశ్రయము నిర్మించడము మరో మానవ మాత్రునికి సాధ్యమా?

ఇక్కడ కులమతాల ప్రసక్తి లేనే లేదు. సర్వమతాల ప్రతీకలూ పుట్టపర్తిలో దర్శనమిస్తాయి. క్రమశిక్షణ, ప్రేమ, కరుణలే యిక్కడ ప్రత్యేకము. సర్వ ధర్మ ప్రతీకల పవిత్రస్థలమే శ్రీసత్యసాయి పుట్టపర్తి

శ్రీ సత్యసాయిబాబా భక్తులకు గాల్లోంచి విభూదితీసి పంచడము, ప్రసాదాల్ని సృష్టించి పంచడము, నోట్లోంచి శివలింగాలను తీయటము లాంటి వెన్నో చాలామంది విన్నారు. కొందరు భక్తులు ప్రత్యక్షంగా వాటిని స్వీకరించారు కూడా!

ఇవి అతీతశక్తులా, లేక మాయలా, మంత్రాలా అనే విషయములో ఎంతోమంది పరిశోధకులు ఎన్నో ప్రయత్నాలు చేసారు, ఇంకా చేస్తూనే ఉన్నారు.

సత్యసాయిబాబా అతీత శక్తులమీద ఎన్నోసార్లు పరిశోధనా ప్రయత్నాలు చేసిన వారిలో ముఖ్యులు ఐస్‌లాండ్ యూనివర్సిటీ సైకాలజీ ప్రొఫెసర్ డా. హెరాల్డ్‌సన్, అమెరికన్ సొసైటీ ఫర్ సైకికల్ రీసెర్చ్, న్యూయార్క్‌కు చెందిన సైంటిస్టు డా. కార్లిస్ ఓసిస్‌లు ప్రధానమైనవారు. వీరితోపాటు యింకా అనేక సైకాలజిస్టులు, సైంటిస్టులు సత్యసాయిబాబాను ఎన్నోసార్లు దర్శించి ఎన్నో వివరాలను సేకరించారు.

1940 నుండీ 1970 దాకా సత్యసాయిబాబా వెంటనుండే ప్రధాన వ్యక్తులనుకూడా వీరు కలిసి అనేక విషయాలు సేకరించారు.

డా. హెరాల్డ్‌సన్, డా. కార్లిస్ ఓసిస్‌లు 1972 నుండి 1983 దాకా ఆరుసార్లు వాళ్ళ పరిశోధనల నిమిత్తము సత్యసాయిబాబాను దర్శించి ఎన్నో అనుభవాలను పొందారు.

ఈ పరిశోధనల ఫలితముగా డా. హెరాల్డ్‌సన్ "మిరకిల్స్ ఆర్ మై విజిటింగ్ కార్డ్స్" అనే మూడువందల పేజీల గ్రంథాన్ని వ్రాసాడు. ఈ గ్రంథాన్ని లండన్‌లోని సెంచురీ ప్రచురణాలయమువారు 1987లో ప్రచురించారు.

ఈ గ్రంథములో డా. హెరాల్డ్‌సన్ సత్యసాయిబాబా అతీతశక్తులను ఎన్నో వివరించారు వాటిలో కొన్ని మహిమలు....

డా. హెరాల్డ్‌సన్, డా. కార్లిస్ ఓసిస్‌వారి పరిశోధనల నిమిత్తము సత్యసాయి దర్శనములో ఉండగా, లాస్‌ఏంజిల్స్‌నుండి సిడ్నీ క్రిష్టల్, ఆయన భార్య బాబా దర్శనానికి వచ్చారు. ఆ సమయములో అక్కడ యింకా చాలామంది భక్తులున్నారు

ఆ రోజు క్రిస్టల్ దంపతుల పెళ్ళిరోజు. అదీగాక క్రిస్టల్‌కు ఆ రోజుతో అరవై సంవత్సరాలు నిండాయి. ఈ విషయము గ్రహించిన బాబా వారికి భారతీయ సాంప్రదాయ ప్రకారము తన సమక్షములో షష్టిపూర్తి జరపాలనుకున్నారు.

వెంటనే సత్యసాయి బాబా ఒక ఉంగరాన్ని సృష్టించి క్రిస్టల్ భార్య చేతికిచ్చి ఆ ఉంగరాన్ని భర్త వేలికి తొడగమన్నారు. తరువాత బాబా చేతిని అలాగే నేలకు సమాంతరముగా ఉంచి రెండు మూడుసార్లు గాల్లో తిప్పి పిడికిలి బిగించి, వెంటనే తెరిచారు. ఆయన చేతిలో బరువయిన బంగారు గొలుసు ఉంది. అది దాదాపు 32 అంగుళాల పొడవుతో మధ్య మధ్యన బంగారు గుండ్లతో నవరత్నాలు పొదగబడి ఉంది. గొలుసు మధ్యలో అరంగుళము పతకముమీద బాబా బొమ్మ ఉంది.

అంత చిన్నదయిన బాబాగారి చేతిలో ఈ గొలుసు ఎలా ఇమిడిందో అర్థముకాలేదు. ఆ గొలుసే మంగళసూత్రమని, దాన్ని భార్య మెడలో వెయ్యమని క్రిస్టల్ చేతికిచ్చారు బాబా.

ఈ వేడుకలు భక్తులందర్నీ ఆశ్చర్యములో ముంచి వేశాయి.

# సృష్టిలో లేని పండు!

శ్రీ సత్యసాయి బాబాను దర్శించి ఆయన శక్తులను పరీక్షించాలని వచ్చేవారు ఆయన్ని కొంత విసుగుదలకు గురిచేస్తుంటారు. బాబా విసుగు చెందేది ఆ వ్యక్తులమీద కాదు- తనని ప్రదర్శకుడిగా భావిస్తున్నారని! అయినా అటువంటి వారిని కూడా తన అతీత శక్తులతో ఆశీర్వదించే వారు

ఒకసారి బెంగుళూరు నుండి వచ్చిన ఒకతను సృష్టిలో లేనిదానిని సృష్టించమని బాబాను సవాల్ చేసాడు

బాబాకు ఇటువంటి సవాళ్ళు వినుగనిపించినా తన ప్రక్కనేవున్న ఒకతన్ని పిలిచి అక్కడ పడున్న ఆ ఆకులను తెమ్మన్నారు.

అతను ఆకులను తీసుకొచ్చి సాయిబాబా చేతికి అందించారు. ఆకులను బాబా వచ్చిన పరిశోధకుని చేతిలో పోసారు.

ఆ వ్యక్తి చేతుల్లోని ఆకులను చూస్తూ "ఇవి ఆకులు....నేనడిగింది సృష్టిలో లేనిది" అన్నారు.

"కొంచెం ఓపిక పట్టు నాయనా.... పరిశోధకులకు నిదానం అవసరం....ఆ ఆకులమధ్య చూడు" అన్నారు సత్యసాయి బాబా.

బెంగుళూరు సైంటిస్ట్ ఆకులమధ్య చూసాడు. అక్కడ 'ఆపిల్' పండుంది.

"ఇది ఆపిల్‌పండు సృష్టిలో ఉండేదేగా" అన్నాడు సైంటిస్టు.

"అవును....కోసి చూస్తేగానీ నీకు తెలియదు....కోసి చూడు" అన్నారు బాబా.

సైంటిస్టు ఆపిల్‌పండును కోసి చూస్తే సగంవరకూ ఆపిల్, సగంవరకూ సపోటా పండూ ఉంది, మొత్తం పండంతా ఆపిల్ తోలు తోనే ఇమిడుంది. అది చూస్తూనే ఆ సైంటిస్ట్ నోటమ్మట మాటరాలేదు.

"సాయి దుకాణములో అన్నీ దొరుకుతాయి బాబూ....తిన్నిచూడు చాలా బావుంటుంది" అన్నారు సాయి చిర్నవ్వుతో.

# జంట రుద్రాక్షలు

డా॥ హెరాల్డ్‌సన్, డా॥ ఓసిస్‌లు వాళ్ళ పరిశోధనల కోసం మొదటిసారి సాయిబాబాను దర్శించి విషయము చెప్పగానే సాయిబాబా చేతిని ఒక్కసారి గాల్లోకి విసిరినట్లు తిప్పారు.

ఆయన చేతిలోకి ఒక కలకండ ముక్క వచ్చింది. దాన్నాయన రెండు ముక్కలుగా చేసి ఆ ఇద్దరు పరిశోధకులకు అందించారు. అది తాజాగా చాలా శుభ్రంగా ఉంది.

"ఇది ఎలా సృష్టించారు" అడిగాడు డా॥ హెరాల్డ్‌సన్.

"మనసుతో సృష్టిస్తాను. నాకు ఆలోచన వచ్చి ఊహించగానే ఆ వస్తువు నా చేతి కొస్తుంది. ఆధ్యాత్మిక ప్రేమ శాశ్వతమైనది" అన్నారు బాబా.

ఇంకోసారి వారి సమావేశములో....మాటల మధ్యలో సాయిబాబా కుడిచేతిని మూడుసార్లు తిప్పి పిడికిడి తెరిచారు ఆయన చేతిలో మెరిసి పోతున్న ఓ బంగారు ఉంగరము ఉంది. దాన్ని ఆయన డా॥ఓసిస్ చేతి వేలుకి తొడిగారు. సరిగ్గా సరిపోయింది. ఆ ఉంగరము మధ్యన ఒక రాయి, దానిమీద సాయిబాబా బొమ్మ ఉన్నాయి.

ఆ తర్వాత ఇద్దరు సైంటిస్ట్‌లు, సాయిబాబా మధ్యన చాలా సేపు సైన్స్‌మీద చర్చ జరిగింది. దాని కాయన "సైన్స్ పద్ధతుల ద్వారా ఈ అద్భుతాలను కనుక్కోవడము సాధ్యముకాదు. ఇవి సైన్స్ పరిధికి వెలుపల ఉన్నాయి" అన్నారు.

అందుకా ఇద్దరు సైంటిస్ట్‌లూ "సైంటిస్టులు వీటి గురించి అంతగా పరిశీలించలేదు కాబట్టి అవి సైన్స్ పరిధికి వెలుపల ఉన్నాయి. అతీత శక్తులు కలిగిన మీరుగాని సహకరిస్తే వీటి వెనకవున్న విషయాలేమి టన్నది మేము ప్రసరింప చేయగలము" అన్నారు.

"సైన్స్ పరంగా మనిషి ఎంతో విజ్ఞాన వంతుడయ్యాడు. ఎన్నో ఎన్నో కనిపెట్టాడు. వైజ్ఞానికముగా ఎంతో ఎత్తుకెదిగాడు. మీరు కని పెట్టినవన్నీ, అవి మీకు సహకరిస్తేనే కనిపెట్టారా....లేదే! వాటిని మీరు

కనిపెట్టి రూపకల్పన చేసారు!! అలాగే ఈ అతీత శక్తులనూ కనిపెట్ట డానికి ప్రయత్నించాలిగానీ నా సహకారాన్ని కోరడములో అర్థములేదు. అయినా నేను మీ పరిశోధనలకు కారకుడయ్యే ప్రదర్శకుడిని కాదు... నా శక్తుల్ని నన్ను నమ్మిన వారి యోగక్షేమాలకు వినియోగిస్తాను" అన్నారు బాబా

ఆ తరువాత వాళ్ళ సంభాషణ జీవితమూ- ఆధ్యాత్మిక జీవితము మీద సాగింది.

"దైనందిన జీవితమూ, ఆధ్యాత్మిక జీవితమూ జంట రుద్రాక్షల్లా కలిసి పెరగాలి" అన్నారు బాబా.

రుద్రాక్షలంటే తెలియని ఆ సైంటిస్టు లిద్దరూ "రుద్రాక్షలంటే ఏమిటి" అనడిగారు.

వారికి దాని గురించి ఎలా వివరించి చెప్పాలా అనుకున్న బాబా తన కుడి పిడికిలి మూసి రెండు సెకండ్లు తిప్పి తెరిచారు. చేతిలో జంట రుద్రాక్ష ఉంది అప్పటికప్పుడు సందర్భాన్ని బట్టి దాన్ని సృష్టించడము ఆశ్చర్యము కలిగించింది.

దాన్ని డా॥ హెరాల్డ్సన్ తీసుకుని పరీక్షించాడు

ఆ తర్వాత సాయిబాబా దాన్ని తీసుకుని "నీకో కానుక ఇస్తానుండు" అంటూ జంట రుద్రాక్షను పిడికిట్లోనుంచి నోటితో గాలి ఊది తెరిచారు. జంట రుద్రాక్షకు రెండువైపులా బంగారురేకుల తాపడము, ఆ చివరలనుండి చిన్నగొలుసు, గొలుసు మధ్యలోనున్న పతకముమీద కెంపు పొదిగిన శిలువతో అందమైన ఆభరణము తయారయింది. దాన్ని మరో చైన్లో కలుపుకుని మెళ్ళో వేసుకోవడానికి వీలుగా ఉంది

ఆ తర్వాత డా॥ హెరాల్డ్సన్ ఒక వృక్ష శాస్త్రజ్ఞుడిని కలిసి జంట రుద్రాక్ష చూపించి అడగ్గా "జంట రుద్రాక్ష అనేది ఇంచుమించుగా ప్రకృతిలోనే లేదు" అన్నారు.

సాయిబాబా ఇచ్చిన బంగారు ఉంగరము, రుద్రాక్షతోనున్న బంగారు ఆభరణము లండన్లో పనిచేసే బంగారు నిపుణులకు చూపించి పరీక్ష చేయించితే- ఆ బంగారము 22 కేరట్లదే నన్నారు.

ఆ తర్వాత పరిశోధనల్లో ఈ ఇద్దరు సైంటిస్టులు కొన్ని సైన్స్ పరికరాలతో వచ్చి వాటిద్వారా తమ పరిశోధనలకు అనుమతి ఇవ్వమని కోరారు. అందుకు సాయిబాబా నిరాకరించి "ఇవి సైన్స్ పరిధికి వెలుపలున్నాయి- నేను మీ పరిశోధనలకు ప్రదర్శకుడిని కాదని ముందే చెప్పాగా" అంటూ "డా॥ ఓసిస్... మీ ఉంగరము చూసుకోండి" అన్నారు. డా॥ఓసిస్ ఉంగరము మధ్యలో సాయిబాబావున్న స్టోన్ లేదు. మాయమైపోయింది 'ఇదేనా నా ప్రభావము' అన్నట్లు చూసారు సాయిబాబా!

## చైనా వార్‌కు అసలు కారణము అతీతశక్తులా...?!

1962లో ఇండియా-చైనాల మధ్య జరిగిన యుద్ధము అందరికీ తెలిసిందే! ఆకస్మాత్తుగా యుద్ధము మొదలై, అర్థాంతరంగా ఆగిపోయిన ఈ యుద్ధము రావటానికి అసలు కారణాలేంటన్నది రాజకీయ దృష్ట్యా చెప్పేవి బలమయినవి కాదు.

యుద్ధ అనంతరము కొంతమంది విజ్ఞుల అంచనాల ప్రకారము చైనా వార్ కేవలము అప్పటి చైనాఅధ్యక్షుడు 'మావోసేటుంగ్' స్వార్థము వల్లనే జరిగిందని చెపుతున్నారు.

మావోసేటుంగ్ స్వార్థము ఏమిటంటే-చావు లేకుండా వుంటము!

ఈ విషయము వింటానికి నవ్వుగా వున్నా, అతని బలమైన అభిప్రాయం మాత్రము అదే అంటున్నారు కొంతమంది పరిశోధకులు.

చైనా వారు అతీత శక్తులను బాగా నమ్ముతారు. ప్రపంచము మొత్తముమీద అతీత శక్తులను నమ్ముతూ, వాటిమీద పరిశోధనలు మొదలుపెట్టినవారు చైనా వాళ్ళే.

1950 నుండి 1960 వరకు చైనావారి అతీత శక్తుల రహస్య పరిశోధనలు ముమ్మరముగా జరిగాయి. ఈ పరిశోధనల్లో వారు ఎన్నో విషయాలను సేకరించారు.

ఈ అతీత శక్తులకు నిలయము టిబెట్‌లోని 'తావాంగ్' అనే ప్రత్యేక ప్రదేశాన్ని కనుగొన్నారు. ఈ తావాంగ్ సరిగ్గా ఇండియా, చైనా, భూటాన్‌ల మధ్య భాగములో వుంది. ఇండియాకు సంబంధించిన ప్రదేశము.

పరిశోధకులు సేకరించిన విషయాలనుబట్టి ఈ తావాంగ్ ప్రాంతములో ఎందరో యోగులు వున్నట్లు వారందరిలోనూ అతీత శక్తులు ఉన్నట్లూ, ఆ ప్రదేశములో నివసించే వాళ్ళకు అస్సలు చావంటూ ఉండదని....ఎప్పుడు చూసినా నడివయసు వాళ్ళలాగానే పూర్తి ఆరోగ్యంగా కనబడతారని తెలుస్తుంది.

తావాంగ్ ప్రదేశములోని కొంతమంది యోగుల మాటలను బట్టి వాళ్ళ వయసులు ఐదారు వందల సంవత్సరాల పైనే వుంటుందని పరిశోధకులు తెలుసుకున్నారు. ఇలా అతీత శక్తులు పొందినవారు వాళ్ళెపుడు కావాలనుకుంటే అపుడే దేహాన్ని చాలించుకోవటమే తప్పితే చావు లేనట్టుగా చెప్పినట్లు తెలుస్తుంది.

ఇక్కడ యోగులు ఏ ఆశయముతో ఈ తావాంగ్ ప్రదేశములో అతీత శక్తుల గురించి సాధనలు చేస్తున్నారో మాత్రము పరిశోధకులు ఎంత ప్రయత్నించినా కూడా తెలుసుకోలేకపోయారు.

చైనావారి పరిశోధనా సమయాల్లోనే 'జేమ్స్ హిల్టన్' అనే అతను కూడా స్వతహాగా అతీత శక్తులమీద పరిశోధనలు చేసి అతీత శక్తులు వాస్తవమని, అవి పొందాలనుకున్నవారికి అనువైన స్థలము 'టిబెట్'గా పేర్కొన్నాడు.

టిబెట్ ప్రాంతాల్లో అతీత శక్తులను పొందినవారు చాలా శక్తివంతులని, వారు ఏది కోరుకుంటే అది అందుబాటులో వుంటుందని, వాళ్ళకు చావనేదే లేదని, తన పరిశోధనల ఆధారముగా వ్రాసిన 'లాస్ట్ హారిజాన్' గ్రంథములో వివరించాడు.

జేమ్స్‌హిల్టన్ పరిశోధనలు చైనా వారికి యింకా నూతనుత్తేజాన్ని కలిగించాయి. ఎలాగయినా ఆ ప్రాంతాన్ని హస్తగతము చేసుకోవాలని, అక్కడ యోగులందర్నీ నిర్బయముగా పరీక్షించాలని, వారిని తమ

ఆధీనములోకి తీసుకుని అతీత శక్తుల్ని తెలుసుకోవాలని ఆశించి చైనా వార్ జరిగిందనేది ఒక వర్గము అభిప్రాయాలు.

ఈవిషయములో చైనావార్ జరుగుతున్నపుడు ఇండియన్ ఆర్మీకి మేజర్‌గా వుండిన సురేష్‌చోప్రాకూడా ఈ కారణాలన్నీ సమంజసముగా భావించారు.

అప్పట్లో సురేష్‌చోప్రా ఒక పత్రికలో కూడా చైనా వార్‌కు కారణాల్లో ముఖ్యకారణము అతీత శక్తుల కోసమేనని చెప్పారు.

ఆ వ్యాసములో, చైనావార్ జరుగుతున్నపుడు తావాంగ్ ప్రదేశము లోని ఇద్దరు యోగులను వారు బంధించి చైనా తీసుకుపోయి వారిద్వారా ఎన్నో విషయాలను తెలుసుకోవాలని రకరకాలుగా ప్రయత్నించినట్లు అయినా సరే ఆ యోగుల నుండి ఎటువంటి సమాచారము రాబట్టుకోలేక పోయారని, ఆఖరికి విసుగుచెంది వారినేమీ చేయలేక వదిలిపెట్టి, త్వర లోనే యుద్ధమువిరమించుకున్నారని-ఈవాస్తవాలు తర్వాత కొంతమంది సైనిక గూఢచారుల ద్వారా తెలిసిందని వివరించారు.

ఇప్పటికీ చైనావారు అతీత శక్తులను మనస్ఫూర్తిగా నమ్ముతారు. పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనాలో ప్రింటయ్యే 'జిట్రాన్‌జోషి' అనే సైంటిఫిక్ విషయాల పత్రికలో అతీతశక్తులు కలిగినవారిని అసాధారణ వ్యక్తులుగా వర్ణిస్తుంది. అతీత శక్తులను అర్థము చేసుకుని పరిశోధించి సైన్స్ ప్రామాణికత కలిగించడానికి నేటి వైజ్ఞానిక సిద్ధాంతాలు చాలవు అని కూడా ఖచ్చితముగా రాసింది.

# ఆత్మలతో మాటలూ! చేతలూ!!

మనుషులు చనిపోయినా వారి ఆత్మలు అదృశ్య రూపములో బ్రతికే ఉంటాయని, ఈ ఆత్మలు యితరుల్లో ప్రవేశిస్తాయని, అతీత శక్తులు కలిగిన అసాధారణ మనుషులు ఆత్మలతో మాట్లాడగలరని చాలామంది నమ్ముతున్నారు.

1914 లోని మొదటి ప్రపంచ యుద్ధము తర్వాత ఆత్మలతో మాట్లాడతాము. మాలో అతీత శక్తులున్నాయి అనేవారు చాలా ఎక్కువై పోయారు.

చనిపోయిన వారిమీద మమకారముతో, వారేమి చెపుతారో వినా లనే కుతూహలముతో వుండేవారు కూడా ఎక్కువవటము వలన ఆత్మ లతో మాట్లాడతాము అనే మహానుభావులూ ఎక్కువై గౌరవ మర్యాద లతో పాటు ధనార్జన కూడా బాగా సాగిస్తుండే వారు. ప్రజలు కూడా వీరికి అతీత శక్తులున్నాయని నమ్ముతుండేవారు

అప్పట్లో ఈ విధమైన మహత్యాలు చేసే వాళ్ళందర్నీ 'మీడి యమ్స్' అని పిలుస్తుండేవాళ్ళు వీరు చనిపోయిన వారి ఆత్మలతో మాట్లాడుతున్నట్లు నటిస్తూ వచ్చినవారి ప్రశ్నలకు చాలా తెలివిగా సమా ధానాలు చెప్పేవారు.

ఇదంతా ఏమాత్రము నిజముకాదని, ప్రజలను మోసగించి డబ్బు కాజేయటమేనని, ఇటువంటి మహత్యాలు చేసేవారిని నమ్మవద్దంటూ కొంతమంది ప్రచారము మొదలు పెట్టడముతో కొంతకాలానికి జనాల్లో ఈ మహత్యాలమీద మోజు తగ్గింది.

మహత్యాలుచేసే 'మీడియమ్స్‌కి' ఏ మాత్రము పనిలేకుండా ధన సంపాదన తగ్గిపోయేసరికి ఇంకొక కొత్త మహత్యము మొదలుపెట్టారు.

అదేమిటంటే–ఆత్మలతో వ్రాయించటము!

ఆత్మల సందేశాలను తెలుసుకోవాలని వచ్చేవాళ్ళలో, వారి కుటుంబములోని చిన్నపిల్లగాని, పిల్లాడుగానీ ఎవరయితే వారిని చీకటి గదిలోకి తీసుకువెళ్ళి రకరకాల మేజిక్స్ ద్వారా నల్లటి పలకమీద చిన్న పిల్లలకు అనుమానము రాని విధముగా వ్రాసేవారు.

ఇది నిజముగా అద్భుతమంటూ అతీత శక్తుల ప్రభావమంటూ అప్పట్లో ప్రజలు మూఢముగా నమ్ముతుండేవారు.

అటువంటి సమయములో 'బ్రిటిష్ సొసైటి ఫర్ సైకికల్ రీసెర్చ్' సెంటర్‌లో 'రిన్' అనే అతను ఈ మోసాలను అరికట్టాలని పట్టుదలతో

ముందుకొచ్చాడు. ఇటువంటి అద్భుతాలు చేసే మీడియమ్స్‌ను చాలా మందిని గమనించాడు.

అవన్నీ కేవలము మేజిక్కులేనని ప్రజల్లో ప్రదర్శనలిస్తూ రిన్ కూడా అటువంటి అద్భుతాలను చేసి చూపించేవాడు.

ముగ్గురు మహాత్ములు చేసే మీడియమ్స్‌ని రిన్ ప్రత్యక్షంగా పట్టుకుని వారి మోసాలను బయట పెట్టి జైలుకు పంపించాడు.

నిజముగా అతీత శక్తులున్నాయని, వాటిని ఎవరయినా తన ఎదురుగా ప్రదర్శిస్తే 10,000 రూపాయలు డాలర్లు బహుమతిగా యిస్తానని రెన్ ఛాలెంజ్ చేసాడు. అయితే రిన్ జీవించినంత కాలము అటువంటి మహాత్ములు చేసేవారు ఎవరూ ముందుకు రాలేదు.

రిన్ తను జీవించిన 88 సంవత్సరాలవరకూ ప్రజలకు వినోదం కోసం, అతీత శక్తులు, ఆత్మలు అన్నీ బూటకాలని అటువంటి మహాత్ములు చేసే వాళ్ళంతా మోసగాళ్ళని ప్రచారంచేస్తూ, అవన్నీ మేజిక్స్‌గా పేర్కొంటూ తనూ చేసి చూపించేవాడు.

# ఎంత కాలమైనా చెక్కుచెదరని వింత శవాలు (మమ్మీలు)

పూర్వకాలములో కొంతమంది వారి శక్తులద్వారానో, లేదా కొన్ని రసాయనాలు, లేపనాలు మొదలయిన వాటిని వాడి, శవాలు ఎంత కాలమైనా పాడవ్వకుండా ఉంచేవారని, అటువంటి శవాలను 'మమ్మీ'లు అంటారని ఇప్పటికి చాలామంది నమ్ముతున్నారు.

ఈ వింత శవాల పరిశోధనల్లో ఎన్నో ఆసక్తికరమైన విషయాలు అద్భుత వాస్తవాలుగా చరిత్రలో కెక్కాయి.

'చిలీ' అనే ప్రదేశములోని ఒక కొండగుహలో 1954లో పరిశోధకులు ఒక శవాన్ని కనుగొన్నారు. ఆ శవము కొన్ని వేల సంవత్సరాల క్రితముదిగా భావించారు. అయితే ఆ శవము చెక్కుచెదరలేదు. ఆ శవము

అలా తాజాగా వుండటానికి అప్పట్లో వారు ఏ విధమైన రసాయనాలు, లేపనాలు వాడినట్లు కూడా పరిశోధనలో తేలలేదు.

డెన్మార్క్, ఐర్లాండ్, స్కాట్‌లాండ్, రష్యాలలో కూడా ఇలాటి పురాతన శవాలు చాలా లభించాయి. అవి పాడవకుండా, వాసన కూడా లేకుండా వున్నాయి. ఇవన్నీ కొండగుహల్లోనే లభించాయి.

ఈ వింత శవాలన్నీ కొండగుహల్లోనే లభించేసరికి కొండ గుహల్లోని వాతావరణము వలన ఈ శవాలు చెడిపోకుండా వున్నాయా? అందుకనే పూర్వీకులు శవాలను ఇక్కడ వుంచారా? అనే అనుమానాలు పరిశోధకులను వేధించాయి. అటువంటి ప్రత్యేక వాతావరణమేమీ కొండ గుహల్లో కనబడలేదు. ఎన్ని పరిశోధనలు జరిపినా వాతావరణము మామూలుగానే వుంది

1901వ సంవత్సరములో 'డబ్లిన్'లోని సెయింట్ మిచాన్స్ చర్చి సమీపములో పరిశోధకులకు ఒక శవపేటిక దొరికింది. 1679లో ఆ శవ పేటికను భూస్థాపితము చేసినట్లు దానిమీద చెక్కబడి వుంది.

శవ పేటికను తెరిచిన పరిశోధకులు శవాన్ని చూస్తూనే ఆశ్చర్య పోయారు

ఇన్ని సంవత్సరాలు గడిచినా ఆ శవము కొంచెం చెదరలేదు. నిద్ర పోతున్నట్లుగా వుంది ఆ జాలువి శవ పేటికను భద్రముగా మ్యూజియమ్‌కు తరలించి వుంచారు అలాగే కైరో మ్యూజియమ్‌లో కొన్ని వేల సంవత్సరాల నాటి ఈజిప్టు మమ్మీ శవము ఇప్పటికీ భద్ర పరచబడి వుంది

చైనాలోని 'కిసన్ జియాంగ్' ప్రాంతంలోవున మ్యూజియములో భద్రపరచబడిన లోలన్ యువతి శవము ప్రపంచంలోనే అతి పురాతన మైన శవముగా శాస్త్రవేత్తలు భావిస్తున్నారు ఇది దాదాపుగా 6,470 సంవత్సరాల క్రితముదిగా చెపుతున్నారు.

1977 వ సంవత్సరములో జరిగిన ఒక సంఘటన మరీ అద్భుత మైంది.

రోమ్‌లో స్థిరపడిన భారతీయుల జంటకు రెండు సంవత్సరాల పాప వుంది 'సదోజామిట్టి' అనే పాప 1965లో అకస్మాత్‌గా మరణించి తల్లిదండ్రులను దుఃఖ సాగరములో ముంచేసింది.

వారి ఆచారముల ప్రకారము శవాన్ని శ్మశానములో పాతిపెట్టారు.

అప్పటి నుండి ప్రతిరోజూ "అమ్మా నన్ను బయటికి తియ్యి.... నేను నీతోనే వుంటాను.... నన్ను తవ్వి తియ్యి...." అంటూ ఆ పాప రాత్రుల్లో తల్లికి కనిపించి మొరపెట్టుకునేదట!

ముందులో కొంతకాలము ఆ తల్లి ఈ విషయములో పెద్దగా పట్టించుకోలేదు కానీ.... రోజూ వదిలిపెట్టకుండా ఆ పాప అలా కల్లో కనబడి మొర పెట్టుకుంటుంటే ఇక సహించలేకపోయింది. నిజంగా పాప బ్రతికే వుందా అనే భ్రమలో పడింది. ఆ తల్లి మానసికంగా ఏదో తెలియని ప్రభావానికి లోనయిపోతూ ప్రభుత్వానికి తన మొర విన్నవించుకుంది.

ప్రభుత్వమూ, అధికారులు వేళాకోళము చేసారు. ఆమెను మతిస్థిమితము లేనిదానిగా భావించారు అయినా ఆ తల్లి పట్టు వదలలేదు. ప్రభుత్వముతోనూ, అధికారులతోనూ పోరాడుతూ ఆఖరికి పన్నెండు సంవత్సరాల తర్వాత శవాన్ని తవ్వి తీయడానికి ఒప్పించింది

1977లో కొంతమంది ప్రభుత్వపనివారు ఆ బాలికను పాతిపెట్టిన చోట తవ్వి బాలిక శవాన్ని చూసి నిశ్చేష్టులైపోయారు. ఆ పాప ప్రశాంతముగా నిద్ర పోతున్నట్లుంది!

ఇన్ని సంవత్సరాలు ఆ పాప శవము భూమిలో ఉన్నా కుళ్ళలేదు, రంగు మారలేదు, చక్కని రబ్బరు బొమ్మలా ఉంది

ఆ పాపని చూసి తల్లి ఆనందముగా తీసుకుని గుండెలకు హత్తుకుంది. ఈ విషయము ప్రపంచాన్ని దిగ్భ్రాంతి చేసింది. ఎవ్వరికి అంతుబట్టని అద్భుత విషయమైపోయింది!!!

# కొండ గుహలో పురాతన గాజు పలక!

ప్రపంచములోని అద్భుత వాస్తవాలలో గెలీలియో నగరములోని పురాతన గాజుదిమ్మ ఒకటి!

ఇజ్రాయెల్‌లోని ఒక కొండ గుహ లోపల కనుగొన్న ఈ గాజు పలక మహా అద్భుతమైనది.

అతి పురాతన గాజు పలకలలో ఇది మొట్టమొదటిగా దాదాపు వెయ్యి సంవత్సరముల క్రితము దీన్ని తయారు చేసినట్లుగా శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. యిదే కొండ గుహలో యింకా అనేక కళా ఖండాలు వుండడముతో దీన్ని మ్యూజియమ్‌గా మార్చడానికి అక్కడి ప్రభుత్వము భావిస్తున్నది.

అయితే ఈ పురాతన గాజు పలకను కదిలించడానికి ప్రయత్నిస్తే దాని లోపల నుండి శక్తివంతమైన విద్యుద్ఘాతము వచ్చి భయకంపితుల్ని చేస్తుంది!

పురాతన కాలములో జావిష్ ప్రజల్ని అమానుషముగా జీవసమాధి చేసిన సామూహిక సమాధులు ఈ కొండగుహల్లో ఉండటము వలన ఈ గుహలపై ప్రపంచము కన్ను పడింది. పూర్వకాలములో ఈ కొండ గుహలను వాటర్ టాంక్‌లుగా వుపయోగించుకున్న నిదర్శనాలు వున్నాయి.

ఈ గుహలను శుభ్రపరిచి సందర్శకులకు అనుకూలంగా తీర్చి దిద్దడానికి ప్రభుత్వము జరిపిన పరిశోధనలు ఫలించలేదు. అదేమి చిత్రమో పనిచేయడానికి గుహలో ప్రవేశించిన బుల్‌డోజర్ ఆగిపోయింది. యంత్రాలు పనిచేయడము మానేశాయి.

1960 లో పురాతన వస్తు పరిశోధనా శాఖవారు ఈ గుహల్లో ప్రవేశించి వారి పరిశోధనలు ప్రారంభించారు 1964 లో అమెరికా పరిశోధనా బృందము వారు డాక్టర్ రాబర్ట్ బిల్ అధ్యక్షతలో పరిశోధనలు ప్రారంభించారు.

ఈ పరిశోధకులందరూ గాజుపలక రూపొందించబడిన విధానానికి ఆశ్చర్యపోయారు ఆ కాలములోనే వారు గణితశాస్త్ర రీత్యా ఒక నిర్దిష్ట పరిమాణములో దానిని నిర్మించారు.

3.40 మీటర్ల పొడవు, 1.94 మీటర్ల వెడల్పుతో, 50 సెంటీ మీటర్ల ఘనముతో నిర్మింపబడింది. ఈ గాజు పలక బరువు 8.8 టన్నులు

పురాతనకాలములో కొండ గుహలో నిర్మించబడిన ఈ గాజుపలక వెనక ఉన్న చరిత్ర కోసము అన్వేషణ ప్రారంభమైంది. అసలు కొండ గుహలో దీనిని నిర్మించకానికి కారణమేంటో అర్థం కాలేదు.

డాక్టర్ బిల్ పరిశోధనల్లో గాజుదిమ్మ అడుగు భాగములోని గల కొండ శిలలు, అనేక పదార్థాల మిశ్రమ సంకేతాలు పరిశీలించగా, ఆ మిశ్రమాలను వేడి చేసి గాజు దిమ్మగా తయారు చేసారని వివరించారు. దీన్ని క్రీ॥ శ॥ 4 నుండి 7 వ శతాబ్దములో నిర్మించారని తెలియచేసారు

దీనిని ఎవరు ఎప్పుడు నిర్మించినా, ఎందుకు, ఎలా నిర్మించారనేదే పరిశోధకులకు సరిగ్గా అంతుబట్టని విషయము. ఈ శతాబ్దపు మానవుని మేధస్సుకు అది సవాలుగా నిలిచింది. ఆ గాజు దిమ్మను ఛేదించే విషయములో నేటి ప్రపంచము విజ్ఞానపరముగా ఓడిపోయింది.

అలాగే చైనాలో ఒక పురాతన సమాధిలో లభించిన అల్యూమినియము రేకు ప్రపంచాన్ని అద్భుతములో ముంచేసింది. ఈ రేకు క్రీ॥శ॥ 5-420 మధ్య కాలములో చైనా యుద్ధవీరుడు ఛోజా సమాధికి అమర్చబడి వుంది.

అప్పటి కాలములో అసలీ లోహాన్ని ఎలా కనుగొన్నారు– దీన్ని గా ఎలా మలిచారనేది ఈ నాటికీ ప్రపంచానికి అంతుబట్టని విషయం.

వీటి ఆధారాలతో పరిశోధకులు ఇంకా వారి పరిశోధనలను సాగి నే ఉన్నారు. ఇంకా ఇటువంటి పురాతన అద్భుతాలు బయటపడి,

ఇప్పటి సైన్స్‌కన్నా అప్పటి సైన్స్ చాలా గొప్పదని చెపుతాయో మో చూడాలి మరి!!

# ఆడ భక్తులకు ప్రేమదానము చేసే కలియుగ శ్రీకృష్ణ భగవానుడు!

కామముతో మోక్ష మార్గమంటూ ప్రచారాలతో ఎన్నో దేశాల్లోని, ఎంతోమంది ధనికులను ఆకర్షించి, వాళ్ళను, శిష్యులుగా స్వీకరించి, విపరీత ధన సంపాదనతో, ఎనలేని పేరు-ప్రతిష్టలతో ఒక సీజన్‌లా వెలిగిపోయిన ఆచార్య రజనీష్ అందరికీ తెలిసిన వ్యక్తే!

ప్రపంచములోనే ఒక గొప్ప ధనవంతుడిగా చెలామణి అయిన ఆచార్యరజనీష్ మరణముతో ఆ ప్రచారాలకు తెరపడింది భక్తులువిచ్చల విడి శృంగారాలు మానేసి ఎవరు పనుల్లోకి వారు వెళ్ళిపోయారు

ఇలా....ఒక్కొక్కరు తెలివి తేటలతోనో, శక్తులతోనో ప్రజలను ఆకర్షించి భగవంతుని తరఫున ప్రజలకు సేవచేయడానికే వారు అవతరించామని చెప్పుకుంటూ చెలామణి అయిపోతున్నారు.

అటువంటి వ్యక్తే 'మహాప్రభు కృపాలూ మహరాజ్'

అలహాబాద్‌కు అరవై కిలోమీటర్ల దూరములోని 'మాన్‌ఘడ్' ప్రాంతములో సుమారు 80 ఎకరాల సువిశాల స్థలములో ప్రశాంతమైన వాతావరణములో మహాప్రభు కృపాలూ మహరాజ్ ఆశ్రమము ఎప్పుడూ కాష్టిలీ భక్తులతో కిటకిటలాడుతూ కళకళలతో మెరిసిపోతూ ఉంటుంది.

కొన్ని సందర్భాలనుబట్టి మహాప్రభు భక్తులనుద్దేశించి అనర్గళముగా ఉపన్యాసాలిస్తుంటారు ఆ ఉపన్యాసాలను వినే భక్తులు తన్మయులై పోతారు ఆయన విగ్రహము, ధరించిన పట్టుపీతాంబరాలు, ఒంటిమీద వజ్ర వైడూర్యాలూ భక్తులను చూపు మరల్చకుండా ఎక్కడికో తీసుకుపోతాయి.

'మహాప్రభు' అవతారములో, గొంతులో అంతటి ఆకర్షణాశక్తి ఉంది.

ఆయన భక్తులలో అందరూ డాక్టర్లు, ఇంజనీర్లు, ప్రొఫెసర్లు, పెద్ద పెద్ద అధికారాల్లో ఉండేవారు. పెద్ద పెద్ద వ్యాపారస్తులు, రాజకీయ నాయకులు.... అందరూ గొప్పవారు.... అంతకుమించి ధనవంతులు, మగభక్తులతో సమానముగా ఆడభక్తులూ ఉంటారు.

వీళ్ళందరికీ మహాప్రభు మాట వేదవాక్కు! ఆయన దృష్టి తమ మీద పడితే చాలు జీవితము ధన్యమయిపోయినట్లు భావిస్తారు.

సందర్భాలనుబట్టి మహాప్రభు ఉపన్యాసాలు ఏర్పాటు చేస్తారు. ఉపన్యాసము అనంతరము ఏదో ధర్మకార్యము కోసం భక్తుల దగ్గిర ఏముంటే అవివ్వమని విరాళాలు కోరుతారు.

అంతే....! భక్తులు విరాళాలివ్వడానికి పోటీపడతారు.... నోట్ల కట్టలకు కట్టలు, ఆడాళ్ళు చేతిగాజులు, ఉంగరాలు, మెళ్ళో గొలుసులూ మొత్తం బంగారము నిమిషాలమీద మహాప్రభు వారి పాదాల చుట్టూ గుట్టలుగా పడతాయి.

వాటిని ప్రభు చిరునవ్వుతో చూస్తూ ఆనందముగా స్వీకరిస్తారు.

అనంతరము ఉత్తమ భక్తులకు ప్రేమదానము జరుగుతుంది

"ఈ వేళ చాలా పవిత్ర దినము.... శ్రీకృష్ణ పరమాత్మ ఈవేళ మీకు ప్రేమదానము చేయవలసిందిగా పురిగొల్పి పంపాడు. ఆ అదృష్ట వంతులు ఎవరో!... శ్రీకృష్ణ స్వరూపుడయిన నేను ఎవరికి ప్రేమదానము చేస్తానో వారికి స్వర్గలోక ద్వారాలు తెరవబడతాయి. ఆ కుటుంబ సభ్యు లందరికీ అనుకున్న కోరికలు ఫలించి, సర్వసుఖాలూ లభ్యమవుతాయి" అంటూ ప్రకటిస్తారు.

మహాప్రభు ప్రకటన అయినంతనే ఆడ భక్తులు నేనూ.... నేనూ.... అంటూ ఎగబడతారు.... మగ భక్తులు కూడా వాళ్ళ భార్య లనూ, కూతుర్లనూ కూడా ప్రభు అనుగ్రహానికని ముందుకు నెడు తుంటారు.

ఈ విధముగా మహాప్రభు చుట్టూ ఎంతో మంది స్త్రీలు గుమి గూడతారు. అపుడు మహాప్రభు గోపికల మధ్యన శ్రీకృష్ణునిలా ఉంటారన్నమాట!

చుట్టూ ఉన్న స్త్రీలను పరిశీలనగా చూసి, కంటికి నదురుగా, అందముగా ఉండే ఒక ప్రౌఢస్త్రీని, అపర రతీదేవిలా ఉండే ఓ పడుచు పిల్లనూ ప్రభువుల వారు కోరుకుంటారు తతిమ్మా వారంతా తర్వాత కార్యక్రమములో నయినా ప్రభువుల అంగీకారము దొరుకుతుందని ఆశతో వెళ్ళిపోతారు.

ఎంపికయిన ఇద్దరు స్త్రీలను మహాప్రభు శిష్యులు ప్రత్యేక పూజ కోసమని, మహాప్రభు అంతర్ మందిరములోకి తీసుకు వెళ్ళిపోతారు వారికి అభ్యంగన స్నానము చేయించి, చందన లేపనాలు, అత్తర్లుపూసి బాగా అలంకరించి ప్రేమదానము కోసమని ప్రభువిడిదిలోకి పంపుతారు.

ఆ తరువాత విడిదిలోకి వెళ్ళిన స్త్రీలందరూ గోపికలవుతారు, ప్రభు శ్రీకృష్ణ పరమాత్మునిలా శృంగార పురుషుడవుతాడు. ప్రేమ దానాన్ని ధారపోస్తాడు!

ఈ విధముగా మహాప్రభు దేశమంతటా ఎక్కువగా సంచరిస్తూనే ప్రేమదానాలను భక్తులకు అందజేసేవారు ఈయనకు "యూనివర్సల్ సొసైటీ ఆఫ్ స్పిరిట్యువల్ లవ్" ట్రస్టు ఉంది. బృందావనములో కోటి రూపాయలవిలువయిన ఆశ్రమము ఉంది ముస్సోరి, ఢిల్లీ, బొంబాయిల్లో పెద్ద పెద్ద అధునాతన భవంతులున్నాయి.

కృపాలూ మహరాజ్‌కు కాశీ విద్యాపీఠము వారు 'జగద్గురు' అనే బిరుదునిచ్చి ఘనముగా సత్కరించారు.

ఈయన వయసు 70 సంవత్సరాలు, అయినా పసిమి ఛాయతో, కండలు తిరిగిన శరీరముతో తేజోవంతముగా 50 సంవత్సరాల లోపు గానే కనిపిస్తారు.

ఇప్పుడు—

మహాప్రభు కృపాలూ మహరాజ్‌గారు ప్రస్తుతము నాగపూర్ సెంట్రల్ జైల్లో ఇనుప ఊచలు లెక్కపెట్టుకుంటున్నారు. ఎంతోమంది

...ందమయిన అమ్మాయిల అపహరణ, మానభంగాల కేసులు రుజు...వడముతో ఈయనకు జైలుశిక్ష పడింది. పెద్ద పెద్ద న్యాయవాదులు ...తము ఈయన్ని బయటకు తీసుకు రాలేకపోయారు

జైలులో ఉన్నా మహాప్రభు ఠీవికేం తక్కువ లేదు. భక్తులు ...ంకా దర్శనము కోసము జైలుకువస్తూనే ఉంటారు. అందర్నీ మామూలు ...నే ఆశీర్వదిస్తూ ఉంటారు. ఆయన ముఖములో ఏమాత్రము బాధకన ...దదు. చిరునవ్వుతో ప్రశాంతముగా ఉంటారు. శ్రీకృష్ణ పరమాత్ముడు ...ట్టినపుడు జైల్లో ఉన్నాడు, ఈ కలియుగ శ్రీకృష్ణుడు చివరిదశలో ...ల్లో ఉన్నాడు. ఇద్దరి మధ్యనా అంతే తేడా. అయితే శ్రీకృష్ణ జన్మ ...నములో రాసక్రీడలు– ప్రేమదానాలు కుదిరిచావటం లేదు.

ఈయన అసలు పేరు లలిత ప్రసాద్‌త్రిపాఠీ!!

# ఈ సమాధిని సందర్శించిన చావు తప్పదు!

ఏడు ప్రపంచ వింతల్లో- ప్రథమ వింతగా ప్రసిద్ధి చెందినవి ...ఈజిప్టు'లోని 'పిరమిడ్స్' మానవ నిర్మిత పర్వతములుగా పేరుగాంచిన ... వింత గొలిపే పిరమిడ్స్ 5000 సంవత్సరాలకు పూర్వమే నిర్మింప ...డినవిగా పరిశోధకులు భావిస్తున్నారు.

ఈజిప్టులో నున్న పిరమిడ్స్ అన్నీ- ఈజిప్టును పరిపాలించిన ...జవంశీయుల సమాధులే. ఈ పిరమిడ్స్ అన్నింటిలో.... 'కయిగో'కు ...గ్గరలో 'గిజా' అనే చిన్న పట్టణానికి దగ్గరలో నున్న "పెరోహ్ ...యోన్స్" అనే రాజు యొక్క పిరమిడ్ చాలా పెద్దదిగా పేరు ...ందింది. ఇది 13 ఎకరాల వైశాల్యములో, 480 అడుగుల ఎత్తులో ...ంటుంది. ఈ కట్టడానికి ఉపయోగించిన రాతి ఫలకలు ఒక్కొక్కటి ...ండున్నర టన్నుల బరువైనదనీ, ఈ సమాధిని దాదాపుగా లక్షమంది

కార్మికులు ఇరవై సంవత్సరాలు కష్టపడి నిర్మించి ఉండగలరని పరిశోధకులు భావిస్తున్నారు.

ఎక్కువ నిధినిక్షేపాలు గల సమాధిగా 'టుటాన్ ఖామూన్' సమాధి పేరుగాంచింది. ఈ సమాధిలోని విలువైనా సంపద ఉన్నట్లుగా పరిశోధకులు భావించారు. అప్పటినుండి టుటాన్ ఖామూన్ సమాధి గురించి గాలింపుల మొదలయ్యాయి. చివరకు 1922వ సంవత్సరం నవంబర్ 26వ తారీకున 'లార్జ్ కార్నర్ వాన్' 'హరాల్డ్ కార్టర్' అనే పరిశోధకులు- టుటాన్ ఖామూన్ సమాధిని కనుగొన్నారు.

టుటాన్ ఖామూన్ సమాధిని కనుగొన్న కొద్ది రోజుల్లో కార్నర్‌వాన్ అస్వస్థుడై కోమా స్థితిలోకి చేరుకుని మరణించాడు. అప్పటికి అతని వయస్సు 57 సంవత్సరాలు మాత్రమే! కార్నర్‌వాన్ మరణించిన సమయములో కైరో పట్టణము మొత్తం ఏ కారణము లేకుండా కరెంట్‌పోయి, కొద్దిసేపటి తర్వాత వచ్చింది. అదే సమయములో కార్నర్‌వాన్ పెంపుడుకుక్క దీనముగా అరుస్తూ చనిపోవడము మరో విశేషము. ఈ వింత పరిణామములకు కారణాలు ఏమిటన్నది ఎవరు చెప్పలేక పోయారు. కొందరు మాత్రము "టుటాన్ ఖామూన్ సమాధిని సందర్శించటమే" అనుకున్నారు.

కార్నర్‌వాన్ చనిపోయిన రెండు నెలలకే హరాల్డ్ కార్టర్‌కూడా హఠాత్‌గా చనిపోయాడు. 'లాఫ్లోర్' అనే ఒక ప్రొఫెసర్ టుటాన్ ఖామూన్ సమాధిని సందర్శించి వచ్చిన రాత్రే ఒక హోటల్ గదిలో చనిపోయాడు. తర్వాత అమెరికా పరిశోధకుడు ఒకరు సమాధిని సందర్శించి వచ్చిన రెండ్రోజులకే హఠాత్‌గా చనిపోయాడు. వీళ్ళందరు విషజ్వరము మూలాన హఠాత్‌గా చనిపోయినట్లు డాక్టర్స్ నిర్ధారించారు.

అప్పటినుండి టుటాన్ ఖామూన్ సమాధి.... మృత్యు సమాధి మృత్యు కౌగిలి పిలవబడసాగింది. పరిశోధకులుగానీ, సందర్శకులుగానీ ప్రాణభయముతో ఆ సమాధి గురించిన పరిశోధనలను విరమించుకున్నారు.

టుటాన్ ఖామూన్ సమాధిని సందర్శించిన వారందరూ విష జ్వరంవలన మరణించడానికి అసలైన కారణాలు ఏమిటి? అని కొంత మంది పరిశోధకులు ఆలోచనలో పడ్డారు. చివరికి వాళ్ళు తెలియపర్చి నది ఏమిటంటే ఈజిప్టు దేశపు పూర్వీకులు వారి మూలికా పరిజ్ఞానముతో సమాధి వాతావరణాన్ని విషతుల్యముచేసి సమాధిని ఎవరూ సందర్శించ కుండా, రాజుగారి రహస్యాలు బయట ప్రపంచానికి తెలియకుండా వుండా లని భావిస్తున్నారు.

కానీ కొంతమంది విమర్శకులు మాత్రము.... కేవలము మూలి కలతో ఇన్నివేల సంవత్సరాల వాతావరణాన్ని విషతుల్యము చేయటము అసాధ్యమనీ, ఇది సరైన కారణము కాదని.... సమాధిని సందర్శించి చనిపోయిన వారందరూ అంతకుముందే రోగులై వుంటారని, సమాధిని సందర్శించడానికి వెళ్ళే ఎడారి మార్గంలో అధిక వేడిమికి, ఇసుక తుఫానుల కాలుష్య వాతావరణమునకు రోగము ముదిరి హఠాత్‌గా చని పోయి వుంటారని విమర్శించారు.

ఏది ఏమయినా అంతవరకూ టుటాన్‌ఖామూన్ సమాధిని సంద ర్శించిన వారందరూ చనిపోవడంతో ఇదొక సంచలన మయింది. దీన్ని సినిమాగా తీస్తే సంచలనము సృష్టించి విజయవంతమౌతుందని బ్రిటీష్ టెలివిజన్‌వారు 'ది కర్స్ ఆఫ్ కింగో టూట్' అనే పేరుతో సినిమాను ప్రారంభించారు.

సినిమా షూటింగ్ మొదటిరోజునే హీరోగారి కారు అనుకోని ప్రమాదానికి గురై, హీరో కాలు తెగిపోయింది. దాంతో ఆ సినిమా నిర్మాణము ఆగిపోయింది.

టుటాన్ ఖామూన్ సమాధి వివరాలన్నింటినీ సేకరించుకొని, ఒక నిశ్చయానికి వచ్చిన అమెరికా పురావస్తుశాఖ డైరెక్టర్ "డాక్టర్ గామిల్ ఎడోడిన్ మెహర్జ్" మాత్రము దేన్ని లెక్కచేయలేదు. కొంతమంది త్రవ్వకాల నిపుణులయిన బృందముతో టుటాన్ ఖామూన్‌సమాధిని సంద ర్శించి, వేగంగా త్రవ్వకాలను సాగించి- సమాధిలోని విలువైన వాటిని బయటకు తీశాడు.

అప్పటివరకూ పరిశోధకులను దడ పుట్టించిన టుటాన్ ఖామూన్ సమాధి విషయములో విజయము సాధించిన 'డాక్టర్ గామిల్ ఎడోడిన్ మెహర్జ్' పాత్రికేయులతో "నా జీవితకాలము చాలా వఱకూ సమాధుల ప్రత్యేకము, వాటిలో వున్న శవాలు, వస్తువులతోనే గడిచిపోయింది. మూఢనమ్మకాలను నేను నమ్మను.... అదే నా విజయానికి కారణము" అని చెప్పాడు.

కానీ.... కొద్ది రోజుల్లోనే డాక్టర్ గామిల్, అతని ప్రత్యేక బృందము హఠాత్‌గా మరణించారు ఈ విషయము అన్నిటికన్నా సంచలనమయింది! "సమాధి సందర్శిస్తే చావు తప్పదనే" టుటాన్ ఖామూన్ సమాధిశక్తి చరిత్రలో మిగిలిపోయింది.

"ఈ సమాధి సందర్శిస్తే చావు తప్పదు" అనే అర్థాన్నిచ్చే ఆ కాలపు అక్షరాలు టుటాన్ ఖామూన్‌సమాధి గోడలమీద ఒక రాతి ఫలకము మీద చెక్కబడి వుండటాన్ని కూడా డాక్టర్ గామిల్ కనుగొన్నాడు. ఆ రాతి ఫలకమును ఫోటోలుకూడా తీసాడు.

ఈ రాతిఫలకము ఫోటోలను, టుటాన్ ఖామూన్ సమాధిలో లభించిన వస్తువులను అప్పటి పత్రికలు అన్నీ ప్రచురించాయి. పరిశోధకులు భావించినంతగా టుటాన్ ఖామూన్ సమాధిలో అత్యంత విలువైన సంపదేమీ లభించలేదు.

# తల నీలాలు పెరుగుతున్న బొమ్మ!

'ఆత్మలు' వున్నాయా లేవా? అనే పరిశోధనలు ఒకానొక కాలములో విస్తృతముగా జరిగాయి. అదే సమయములో 'ఆత్మలున్నాయి.... ఆత్మలతో మాట్లాడిస్తాము' అంటూ కొందరు బయలుదేరారు కూడా. అయితే సైన్స్ ప్రామాణికతలేని ఈ విషయము మీద పరిశోధనలు అనవసర శ్రమనుకుని అటువంటి పరిశోధనలకు స్వస్తి చెప్పారు. అయితే-

ఇంకా కొందరు మాత్రము సైన్స్‌కు అందని ఇలాంటి విషయాలను 'అతీతశక్తులుగా' భావించి నమ్మటము జరుగుతుంది.

1958 వ సంవత్సరములో జపాన్‌లోని 'హోంజిసైరైబో' అనే గ్రామాలలో 'సుజికి' అన్నతని చెల్లెలు హఠాత్‌గా చనిపోయింది. ప్రాణప్రదముగా చూసుకునే చెల్లెలు అకస్మాత్‌గా చనిపోవడముతో విరక్తిచెందిన సుజికి- తన చెల్లెలికి అత్యంత ఇష్టమయిన బొమ్మను, బొమ్మతో పాటు చెల్లెలి చితా భస్మాన్ని ఒక పెట్టెలో పెట్టి తాళమువేసి, ఆ చెక్క పెట్టెను అక్కడ ఒక దేవాలయము లోని పూజారికిచ్చి భద్రపరచమని చెప్పి, అతను సైన్యంలో చేరటానికి వెళ్ళిపోయాడు.

1847 వ సంవత్సరములో సుజికి సైన్యమునుండి స్వగ్రామానికి తిరిగి వచ్చి, దేవాలయానికి వెళ్ళి తను భద్రపరచమని ఇచ్చిన పెట్టెను తీసుకున్నాడు ఇంటికివెళ్ళి ఆ చెక్క పెట్టెను తెరచి చూస్తే అందులోని రబ్బర్ బొమ్మకు తలనీలాలు పొడవుగా పెరిగి వున్నాయి.

ఇదేదో మహత్తరమైనదని, ఇంతకాలము దేవాలయములో వుంచ దము వలన దైవత్వము సంతరించుకున్నదని భావించి, ఈ విషయాన్ని గుడి పూజారికి వివరించి, ఆ బొమ్మను దేవాలయములోనే వుంచారు శిరోజాలు రోజురోజుకూ పెరగసాగాయి. ఈ విషయము గ్రామమంతా తెలిసింది ... అందరూ ఈ వింతను చూసి 'దైవ మహిమ'గా భావించి పూజించసాగారు

కొద్ది రోజుల్లోనే ఈ వింత జపాన్ దేశమంతా ప్రాకింది కొన్ని పత్రికలు, శిరోజాలు పెరుగుతున్న బొమ్మ ఫోటోలను ప్రచురించాయి. ఎక్కడెక్కడినుండో ప్రజలు వింత బొమ్మను చూడటానికి రాసాగారు. ఆ గ్రామము పెద్ద యాత్రాస్థలముగా మారిపోయింది

ఇదే అదనుగా కొంతమంది అతీతశక్తులున్నాయని చెప్పుకునే వారు. ఇది దైవమహిమేమీ కాదని- చనిపోయిన సుజికి చెల్లెలి ఆత్మ ఆ బొమ్మలో ప్రవేశించి వుండటము వలన తలనీలాలు పెరుగుతున్నాయనే ప్రచారాన్ని లేపారు.

కొంతమంది పరిశోధకులు, డాక్టర్లు ఈ బొమ్మ, దాని శిరోజా

లను పరీక్షించారు. అవి మానవ శిరోజాలుగానే తేలాయి. కానీ- ఆ బొమ్మ మీద ఈ శిరోజాలు ఎలా పెరుగుతున్నదనే విషయం మాత్రం ఎవరికీ అంతుబట్టకుండా మిగిలిపోయింది ఇప్పటికే ఆ బొమ్మ శిరోజాలు పెరుగుతూనే వున్నాయి. ఇదొక అంతుబట్టని అద్భుత వాస్తవముగా మిగిలిపోయింది.

# అనుకోని ఆశ్చర్యకరమైన సంఘటనలు

జీవితములో కొన్ని యాదృచ్ఛిక సంఘటనలు జరుగుతూ వుంటాయి ఈ విషయముపై ఎందరో మానసిక శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేసినా శాస్త్రీయ విశ్లేషణ చెయ్యలేక పోయారు.

1978 వ సంవత్సరములో ఆగస్ట్ 6 వ తారీఖున 'పాప్‌పోల్-6' మరణశయ్య మీద వున్నారు. అదే గదిలో— ఆయన 1923 వ సంవత్సరములో కొన్న అలారము గడియార మొకటి వుంది. గత 55 సంవత్సరాలుగా ఆ గడియారము ఉదయాన్నే ఆరు గంటలకు అలారము గంటలు కొట్టి పాప్‌పోల్‌ను నిద్ర లేపేది. ఆ రోజు ఉదయము ఆరు గంటలకు పాప్‌పోల్ మరణించాడు. అదే సమయానికి గంటలు కొట్టే గడియారము గంటలు కొట్టలేదు. ఆడటము కూడా ఆగిపోయింది. దీనికి కారణము ఏమిటన్నది ఎవరూ చెప్పలేరు. ఇదొక యాదృచ్ఛిక సంఘటన!

ఒక ఔత్సాహిక నటునికి- ఒక టి వి. సినిమాలో వేషము ఇస్తాను అన్నాడు నిర్మాత. వారు సినిమాగా తీయబోయే నవల పేరు చెప్పి— అందులో ఆ నటుని పాత్ర చెప్పి; ఆ పాత్రకు తగ్గట్టుగా తర్ఫీదు పొంది ఇంటర్వ్యూకి రమ్మని చెప్పారు.

అప్పటి నుండి ఆ నటుడు.... సినిమాగా తీయబోయే నవలను కొందామని బుక్ షాప్స్ అన్నీ తిరిగాడు. దొరకలేదు. లైబ్రరీలన్నీ తిరిగాడు- కనబడలేదు. మర్నాడే ఇంటర్వ్యూకి హాజరు కావాలి. వచ్చిన

అవకాశము పోవటము ఖాయమనే నిరుత్సాహముతో లైబ్రరీ నుండి బస్ స్టాప్ వద్దకొచ్చి బస్ ఎక్కి కూర్చున్నాడు. రెండు స్టాప్స్ దాటిన తరువాత బస్ రష్ అయ్యింది. నటుని ప్రక్కనే నించున్న ఓ వయసు మళ్ళిన వ్యక్తి ఒకచిన్న ప్యాకెట్‌ను నటునికి ఇచ్చి పట్టుకోమన్నాడు. ఆ నటుడు పాక్యెట్‌న పట్టుకున్నాడు.

నటుడు దిగవలసిన స్టాప్ వచ్చేసింది. చేతిలోని ప్యాకెట్ ముసలి వ్యక్తికి యిచ్చేద్దామని చూస్తే- ఆ వ్యక్తి బస్‌లో ఎక్కడా కనబడలేదు. 'ఏ స్టాప్‌లో దిగిపోయాడో' అనుకుంటూ.... ఆ నటుడు బస్ దిగి ఇల్లు చేరుకున్నాడు. చేతిలోవున్న ప్యాకెట్‌లో ఏమున్నాయో చూద్దామని విప్పదీశాడు. ఆశ్చర్యం.... అవి మూడు పుస్తకాలు అందులో ఒక పుస్తకము ఆ నటుడు వెతుకుతున్న నవల. ఆనందముతో నవలలోని తన పాత్ర తీరును బాగా వంటపట్టించుకుని మర్నాడు ఇంటర్వ్యూకెళ్ళి విజయము సాధించి సినిమాలో వేషము దక్కించుకున్నాడు. ఇదీ యాదృచ్ఛికముగా జరిగినదే!

చాలా కాలము క్రితము ఒక అమెరికన్ రచయిత తన నవలలో ఒక ఓడ ప్రమాదానికి గుఱై, నావలో చాలామంది చనిపోగా; నలుగురు నావికులు, ఒక బాలుడు బ్రతికి ఒక దీవిని చేరుకుంటారు. ఆ దీవిలో రాళ్ళ గుట్టలు తప్ప మరేమీ వుండవు. నావికులు ఆకలిని తట్టుకోలేక బాలుడ్ని చంపి తినేస్తారు. ఇది ఆ రచయిత కల్పించి వ్రాసినది. అయితే.... 1884వ సంవత్సరములో అమెరికాలో ఒక ఓడ ప్రమాదానికి గుఱికాగా.... అందులో నలుగురు నావికులు, ఒక బాలుడు బ్రతికి, ఒక దీవిని చేరుకున్నారు. ఆ నావికులు కూడా ఆకలికి తాళలేక బాలుడ్ని చంపి తిన్నారు. ఇది యదార్థము. నవలలో బాలుడి పేరు, యదార్థ బాలుడి పేరు 'రిచర్డ్ పార్కర్'!!

## కలలో కనిపించిన చారిత్రాత్మక సత్యాలు

యూరోప్‌లో నివసిస్తున్న 'ఆల్‌ఫ్రెడ్ వాకిన్స్' ప్రముఖ వ్యాపా

రస్థుడు. అతనికి తన వ్యాపారమే ప్రపంచము. వేరే దేని గురించీ పట్టించుకోడు ఇతనికి ఓ కల వచ్చింది. ఆ కలలో ఒక శిధిలమయిన బావి, ఒక శిధిలమయిన చర్చి, మధ్యన రంధ్రము గల ఒక పెద్ద శిల కనబడ్డాయి. మొదట ఆ కల గురించి తను పట్టించుకోలేదు. అంతే— ఇదే కల తఱచు రాసాగింది.

ఈ కల ఇలా తఱచూ ఎందుకు రాసాగిందో వాకిన్స్‌కు అర్థము కాలేదు ఎవరితో చెప్పినా నమ్మరని ఊరుకున్నాడు రోజూ ఇదే కల వాకిన్స్‌ను వెంటాడుతూంది. ఇక వుండబట్టలేక 1967 లో- అలెగ్జాండర్ థోం అనే ప్రొఫెసర్‌కు తన కల గుఱించి, కలలో కనబడే వాటి వివరాలను చెప్పాడు.

అలెగ్జాండర్ థోం తన పరిశోధనల్లో వాకిన్స్ కలలో కనిపించే వాటిని గురించి అవి యదార్థమైనవిగా కనుగొన్నాడు.

వాకిన్స్ కలలో కనబడుతున్న శిథిలమయిన బావి, శిథిలమయిన చెర్చి, మధ్యన రంధ్రము గల పెద్ద శిల.... ఇవన్నీ చాలా ప్రాచీనమయినవి. యూరప్‌లోని జన సంచారము లేని ఒక చిన్న దీవిలో ఇవి వున్నాయి. ప్రాచీన గ్రంథాల ఆధారముగా వీటి వివరాలు బయట పడ్డాయి.

పూర్వ కాలములో యూరోపియన్స్ ఈ దీవిని- ఇందులో ఉండే శిలలను 'లీవైన్' అని పిలిచేవారు ఇక్కడ శిలలు ఎంతో మహత్తరమైనవి, మనుష్యుల రోగాలు నయము చేసేవిగా నమ్ముతుండేవారు. ఈ శిలలలోనే- మధ్యన రంధ్రము గల పెద్దదైన ఏకశిల ఒకటుంది. ఇది ప్రత్యేకమైన మహత్తుగల శిలగా భావించేవారట.... ఈ శిల రంధ్రములో నుండి అటు నుండి దూరి, ఇటు వస్తే- ఎటువంటి రోగమైనా తగ్గిపోతుందని. పిల్లలు లేనివారికి పిల్లలు పుడతారని, గూని వాళ్ళు ఈ శిలను తాకితే వెంటనే గూని నయమైపోతూందని ప్రాచీన కాలము వారు నమ్ముతుండేవారని తెలుస్తోంది.

ఇదే దీవిలో ఉన్నది శిథిలావస్థలో వున్న బావి. చాలా భాగము రాళ్ళతో పూడుకుపోయిన ఈ బావిలోని నీటిని పవిత్ర జలముగా తీసు

కుని త్రాగేవారట. ఈ నీరు త్రాగటము వలన కూడా సకల రోగాలు నివారిస్తాయని నమ్మేవారట. అంతే కాకుండా ఈ బావిలోని నీరు ప్రత్యేకమయిన తియ్యదనాన్ని కలిగి వుండేదట. ఆ బావి దగ్గఱలో నున్న రాతి ఫలకల మీద పురాతన భాషలో కొన్ని ఆరోగ్య సూక్తులు చెక్కబడి ఉన్నాయి.

ఆ దీవి ప్రాంతములోనే పూర్తిగా శిథిలమైపోయిన చెర్చ్ కూడా ఉంది ఇది పూర్తిగా శిలలతో నిర్మించబడింది. పవిత్రమైన శిలలతో కట్టబడిన ఈ చర్చిని అతి పవిత్రమైనదిగా భావించేవారు. కాల గమనములో చర్చి శిథిలమైపోయింది.

వాకిన్స్ కల ఆధారముగా, అలెగ్జాండర్ థోం పరిశోధన వలన పురాతనమైన లీవెన్ దీవి ప్రాంతాన్ని కనుగొనటము దాని ప్రాచీన ప్రాముఖ్యతను తెలిసికోవడముతో ఈ స్థలము ప్రస్తుతము యూరోప్‌లో ప్రముఖ యాత్రా స్థలమైనది. పాత ఆచారాలనే ప్రజలు ఇప్పటికీ నమ్ముతూ ఆ ప్రదేశాన్ని పవిత్రమైనదిగా భావించి పూజిస్తున్నారు. రోజూ కొన్ని లక్షలమంది సందర్శిస్తున్నారు.

## ఇనుమును వంచే కళ్ళు !

ఆ రోజు— నవంబర్ 23, 1973 వ సంవత్సరము! అందరూ టి.వి ల ముందు కూర్చుని- రాబోయే ప్రోగ్రామ్ గురించి ఎదురు చూడ సాగారు.

ఆ ప్రత్యేక ప్రోగ్రామ్ గురించి బ్రిటన్ టి వి. స్టేషన్ వారు ముందుగానే పబ్లిసిటీ చెయ్యడముతో అందరూ మిస్ కాకుండా ఆ ప్రోగ్రామ్ చూడాలని శ్రద్ధతో టి.వి ముందర కూర్చున్నారు

ప్రోగ్రామ్ మొదలయ్యింది. ఓ పన్నెండేళ్ళ కుర్రాడు స్క్రీన్ మీదకు వచ్చాడు. ఒక టేబిల్ ముందు నించున్నాడు. టేబిల్ మీద

ఇనుప వస్తువులు, గరిటెలు, స్పూన్‌లు, స్పోర్క్‌లు మొదలయినవి వున్నాయి.

టేబుల్ మీదున్న ఒక ఇనుప స్పోర్క్‌ను చేతిలోకి తీసికొని— దానివి తీక్షణముగా కళ్ళలో చూశాడు. అది దానంతట అదే మధ్యకు ఒంగిపోయింది. అలాగే చాలా ఇనుప వస్తువులను ఆ కుర్రాడు కంటి చూపుతో వంచసాగాడు. ఇది నిజమా, మాయా అనే ఆశ్చర్యములో మునిగిపోయారు ప్రేక్షకులు!

బ్రిటన్‌కు చెందిన 'యూరీ జెల్లర్' అనే పన్నెండేళ్ళ యువకుడు ఈ ప్రదర్శనలో పాల్గొంది అతనికి ఈ అద్భుత శక్తి ఎలాగ వచ్చిందో అతనికే తెలియదు. తలిదండ్రులకు కూడా తెలియదు.

టి.వి.లో ప్రదర్శన చూసిన చాలామంది పరిశోధకులు 'యూరీ జెల్లర్'ని కలిసారు. రక రకాలుగా పరీక్షించారు. కానీ ప్రత్యేకమైన లక్షణాలేమీ కనబడలేదు. ప్రాతికేయులు చుట్టిముట్టి యూరీ జెల్లర్‌ని ప్రశ్నలతో ముంచెత్తారు ఈ విధముగా యూరీ జెల్లర్ బ్రిటన్, అమెరికాలలో బాగా పాపులర్ అయ్యాడు. కొంతమంది ఉత్సాహవంతులు యూరీ జెల్లర్‌ను చూడటానికి ప్రత్యేకించి వస్తారు.

'సండేటైమ్స్' అనే అమెరికన్ ప్రత్యేక ఎడిటర్ యూరీ జెల్లర్ దగ్గరకొచ్చి 'టిటానియమ్'తో తయారుచేసిన అతని కారుతాళాలు ఇచ్చి ఒంచమన్నాడు యూరీ జెల్లర్ ఆ తాళాలను చేత్తోపట్టుకుని తీక్షణంగా చూసేసరికి అవి మధ్యకు ఒంగిపోయాయి. మళ్ళీ తాళాలను సరిచేయడానికి తాళాలు చేసేవాడికే అరగంట పట్టింది.

నికొలాస్, విలియమ్, జిరార్డ్ అనే ముగ్గురు కూడా యూరీజెల్లర్ లాగానే చూపులతో అద్భుతాలు చేయగలిగే వారిగా ప్రసిద్ధి చెందారు. 'చెలింవా' అనే ఆరేళ్ళ అమ్మాయి చూపులు-నొప్పులనూ, బాధలనూ నివారిస్తాయట ఎవరికయినా శరీరముమీద గాయాలు, నొప్పులూ వచ్చి బాధపడుతూంటే—ఆ పాప బాధగా వున్నచోట చేత్తో నిమురుతూ తీక్షణంగా చూస్తే ఎటువంటి నొప్పులయినా వెంటనే తగ్గిపోతాయట!

వీరిని చాలామంది డాక్టర్లు, సైకియాటిస్టులు, హిప్నటిస్టులు పరీక్షించారుగానీ వీళ్ళలోని అద్భుతమైన శక్తి ఎలా వచ్చిందనేది మాత్రం చెప్పలేకపోతున్నారు.

# మంటలతో ఆటలు

నిప్పుల్లో నడవటము, నోట్లోంచి మంటలు ఊదటము లాంటివి చూడటానికి విచిత్రముగా వుంటాయి ఇవి నిజాలా? విద్యలా? గారడీలా వీటిమీద చాలామందికి రకరకాల ఆపోహలున్నాయి కొంతమంది వీటిని సాహసోపేత విద్యలంటున్నారు, ఇంకొంతమంది అతీత శక్తుల వలన సాధ్యమని అంటున్నారు, మరికొంతమంది ఇదంతా భూటకము, అంతా గారడీ....మాయ అంటున్నారు.

భారతదేశములో చాలామంది ఫకీర్లు, సన్యాసులు నిప్పులమీద నడవటము చాలామంది చూసే వుంటారు. ముఖ్యముగా గ్రామ ప్రాంతాలలో గ్రామదేవతల ఉత్సవమునాడు అగ్నిగుండాలు ఏర్పాటుచేయడము, దానిమించి చాలామంది భక్తులు నడవటము చూసేవారికి ఒళ్ళు జలదరిస్తుంది కణకణలాడే నిప్పులమీద నడిస్తే వాళ్ళను కాలదా? కనీసము బాధపడినట్లు కూడా కనబడరు.

చైనా, టిబెట్, జపాన్, హాంగ్‌కాంగ్‌లలో కూడా నిప్పులమీద నడిచే ఆచారాలు, పండుగలు వున్నాయి. జపాన్‌లోని 'షింటోయిజమ్' అనే ప్రాంతములో అగ్నిగుండాలమీద నడిచేవారు ఎక్కువ.

యోగశాస్త్రములో హఠయోగముతో నిప్పులమీద నడక గురించి వున్నది దీనివలన ఆత్మశక్తి పెరుగుతుందని, సాధకుడి లక్ష్యం నెరవేరుతుందని ఉన్నది

కలకత్తాలోని 'జటూభాయ్' నిప్పులమీద నాట్యమాడుతుంటాడు. జటూభాయ్ ఒక సన్యాసి ఇతను పైజమా, లాల్చీ ధరించి భగవంతుని స్మరించుకుని, నిప్పులమీద చాలాసేపు నాట్యం చేస్తాడు. అతడి కాళ్ళ

గాని, దుస్తులుగాని కాలవు 800 ఫారిన్‌హీట్ వేడికలిగిన అగ్నిగుండములో అతను ఎలా నాట్యం చేయగలుగుతున్నాడో ఎవ్వరికీ అంతుబట్టని విషయము. చాలామంది పరిశోధకులు జటూభాయ్‌ని అగ్నినాట్యానికి ముందు, తర్వాత పరీక్షించారు. వాళ్ళకు ఎటువంటి లేపనాలు, రసాయనాలు పూయలేదని తెలిసింది

నిప్పులమీద నడిచే వాళ్ళను గురించి చాలాకాలము క్రితమే పరిశోధనలు మొదలయ్యాయి 1890లో డాక్టర్ హాకిన్ చాలామందిని పరిశీలించి వారిలోని భక్తిభావము, మానసిక ధైర్యము ఈ శక్తిని ప్రసాదించిందని, ఇది మానసిక సంబంధమైన అద్భుత శక్తిగా ఆయన వివరించాడు

1895లో 'ఎడ్వర్డ్‌క్లార్డ్' అనే శాస్త్రవేత్త అగ్నిగుండాలమీద నడవటము-మహిమలేమీ కావని, సల్ఫ్యూరిక్ ఆమ్లములోగానీ పటికనీళ్ళలోగానీ కాళ్ళు తడుపుకుంటే....నిప్పులమీద నడిచినా కాలదని, చాలామంది ఈ విధముగా చూసేవారిని మోసము చేస్తున్నారని ఆరోపించాడు.

1937లో అగ్నిగుండము తొక్కే అహ్మద్ హుస్సేన్, రెజినాల్డ్, ఎడ్‌కోలను....సైంటిస్టులు నిశితముగా పరిశీలించారు. అగ్నిగుండము తొక్కే ముందు, త్రొక్కిన తర్వాత వాళ్ళ కాళ్ళను పరిశీలించారు. వాళ్ళ పాదాలు ఏమాత్రం కాలినట్లుగానీ, కాలిన బొబ్బలుగానీ ఏమీలేవు. వారిలో ట్రిక్కులు ఏమీ లేవని, వాళ్ళ ఏదో శక్తి వుందని తెలియజేసారు.

# వింతైన నీటి జంతువులు

సముద్రాలలోనూ, పెద్ద పెద్ద సెలయేర్లూ, చెరువులలో కూడా భయంకరమైన వింత నీటిజీవులు వున్నాయని ప్రాచీనకాలమునుండీ చెప్పుకోవడము వింటూనే వున్నాము.

చాలా సంవత్సరాల క్రితము భూమ్మీద రాకాసి బల్లులు వుండే వని అవి కొండల్లా చాలా పెద్దవిగా వుండేవని చరిత్రనుబట్టి తెలుస్తుంది. పరిశోధకులకు అటువంటి జంతువుల అస్థిపంజరాలు కూడా లభ్యమయ్యాయి. అటువంటి రాక్షసబల్లుల అస్థిపంజరాలు కొన్ని మ్యూజియమ్స్‌లో ఇప్పటికీ భద్రపరచబడి వున్నాయి.

రాక్షసబల్లుల లాగానే అతి పెద్దవయిన రాక్షస నీటి జంతువులు కూడా వున్నట్లు, వాటిని కొందరు చూచినట్లు చెపుతున్నారు తప్ప, ఎటువంటి ఆదారాలు దొరకటము లేదు. ఒకవేళ కొన్ని సంవత్సరాల క్రితము న్నా వాటి సంతతి అభివృద్ధి చెందుతూ వుండాలిగదా! పరిశోధకుల కంటబడాలికదా!! అని చాలామంది సందేహాలను వెలిబుచ్చుతున్నారు.

కొన్ని కథల్లో, నవల్లో ఈ రాక్షస నీటి జంతువులను ఎక్కువగా గుర్రపు ముఖముతో నున్న భారీజంతువుగా వర్ణించారు. అందుకే వీటిని 'హార్స్-ఈల్' అంటున్నారు.

12వ శతాబ్దములో ఐర్లాండ్‌లోని ఒక పెద్ద చెరువులో రాకాసి జీవి వుండేదట దీని ఆహారము మనుష్యులు, పశువులేనని, ఆహారము కోసము ఒడ్డుకు వచ్చి దొరికిన పశువులనుగానీ, మనుషులనుగానీ పట్టుకు పోయేదని ఆ ప్రాంతములోనివారు చెప్పుకుంటుండేవారు.

1938 హిందూమహా సముద్రములోని కొంతమంది నావికులు ఒక భయంకరమైన వింత జీవిని చూసి భయపడ్డారట. అది నావవైపు కాకుండా వేరే మార్గములోంచి వెళ్ళిపోవటము వలన ప్రమాదము తప్పినట్లుగా చెప్పారు. ఆ వింతజీవి రూపాన్నిబట్టి-అటువంటి రాక్షస నీటి జీవులు ఏడుకోట్ల సంవత్సరాల క్రితము వుండేవని, వాటిని 'ప్లెసియోసార్' అనేవారని, ఇవి వున్నట్టుండి సముద్రములోంచి పర్వతములా లేచేవని పరిశోధకులు అభిప్రాయాల్ని కొన్ని వ్యాసాల్లో వ్రాసారు

1982లో స్కాట్‌లాండ్‌లోని ఒక పెద్ద సరస్సులో అతి భయంకరమైన వింత జీవిని చూసినట్లుగా, నీటిలో కొండవలె తేలిన ఈ జంతువుకు పొడవాటి తోక ఉన్నట్టుగా....ఆ ప్రాంతానికి పిక్‌నిక్‌కు వెళ్ళిన ఒక స్కూల్ టీచర్ చెప్పింది. అదే సరస్సులో అదే జంతువును మం

రెండేళ్ళ తర్వాత కొంతమంది కాలేజీ కుర్రాళ్ళు చూసినట్లు చెప్పారు. వీళ్ళ మాటలనుబట్టి ఆ సరస్సుకు 1985లో నీటి కెమేరాను పంపి సరస్సు మొత్తము గాలించిరి. కానీ ఎలాంటి జంతువు జాడ తెలియలేదు. మళ్ళీ రెండేళ్ళ తర్వాత ఆ సరస్సు ప్రాంతానికి జూలానికల్ టూర్‌కు వెళ్ళిన సైన్స్ స్టూడెంట్స్‌లో కొందరు ఆ వింత జీవిని చూసినట్లు చెప్పారు.

చైనాలోని పర్వతాల మధ్యగల 'హనాస్' అనే సరస్సులోకూడా వింత నీటిజీవులు వున్నాయని అనుకుంటుండేవారు. ఆ విషయాన్ని పరిశీలించడానికి యూనివర్శిటీ సాంకేతిక బృందం ఒకటి ఆ సరస్సు దగ్గఱకు వెళ్ళింది వాళ్ళకు పదిరోజుల తర్వాత-ఆ సరస్సులో ఒక వింతజీవి అలా కనిపించి మాయమైనట్లు తెలిపారు.

ఇలా... వింతగొలిపే నీటిజంతువుల గురించి కొంతమంది చూశామన్నవారే తప్ప, ఏవైనా వాటి ఆధారాలను కనుగొన్నవారు లేరు.

## హిప్నాటిజమ్ వింతలు

హిప్నాటిజమ్ ఇరవైయవ శతాబ్దములో విశేష ప్రాముఖ్యతలోకి వచ్చింది. 1920వ సంవత్సరములో 'లైట్‌కాల్ట్' అనే ఫ్రెంచి డాక్టర్ ఆపరేషన్ చేయవలసిన పేషెంట్‌కు మత్తుమందు ఇవ్వకుండా హిప్నటైజ్ చేసి, పేషెంట్‌కు బాధ తెలియకుండా ఆపరేషన్ చేసి విజయవంతమయ్యాడు.

పరిశోధకులు మాత్రము-హిప్నాటిజాన్ని, హిప్నోథెరపీని అంగీకరించలేదు. అదొక రకమైన హిస్టీరియాకి సంబంధించిన బలహీనత అని-అందరిమీద దీని ప్రభావము పనిచేయదు కాబట్టి-దీన్ని ప్రోత్సహించకూడదంటున్నారు.

20వ శతాబ్దములో హిప్నాటిజము మీద విస్తృతముగా పరిశోధనలు జరిగాయి. ఎంతోమంది పరిశోధకులు హిప్నోథెరపీలు విజయము

సాధించారు హిప్నాటిజము మీద ఎన్నో పుస్తకాలు వెలువడ్డాయి. కొన్ని లక్షలమంది మంది పాఠకులను ఆకట్టుకుంటున్నాయి

హిప్నోథెరపీ ద్వారా ఎదుటి మనిషి నుండి ఎన్నో వింతయిన విషయాలను రాబట్టగలుగుతున్నారు. 'అమాల్ బ్లోక్సామ్' అనే డాక్టర్ 'జనే ఇవాన్స్' అనే స్త్రీ పై ప్రయోగించిన హిప్నాటిజమ్ చాలా ప్రసిద్ధి చెందింది. హిప్నటైజ్ కాబడ్డ ఆమె 12వ శతాబ్దములోకి వెళ్ళిపోయి–అప్పటి చర్చి, యూదుల వురితీత సంఘటనల గురించి సమగ్రముగా చెప్పింది. ఈ విషయాలన్నీ నూటికి నూరు పాళ్ళు నిజాలే!

మనుషుల మీదే కాక జంతువుల మీద కూడా హిప్నాటిజము పని చేస్తుందని కొందఱు రుజువు చేసారు. ఒక కోడిపుంజును హిప్నటైజ్ చేసి, దానినోటికి చాక్‌పీస్ ఇచ్చి 'గీత' గీయమంటే అలాగే చేసింది. ఈ వింతను చూసిన విమర్శకులు ముక్కు మీద వేలేసుకున్నారు.

హిప్నోథెరపీ పోలీసు డిపార్టుమెంట్‌కు కూడా ఎంతో ఉపయోగ పడుతుంది ఒక రేప్ చేయబడిన యువతి-మామూలుగా రేపిస్ట్ గురించి సరైన వివరాలు చెప్పలేకపోయింది. ఆ యువతిని హిప్నటైజ్ చేయగానే ఆ యువతి-రేపిస్ట్ గుఱించి ఎంతో సమాచారాన్ని చెప్పింది. దాన్ని బట్టి రేపిస్ట్‌ను పట్టుకోగలిగారు పోలీసులు. ఈ శతాబ్దములో ఇదొక సంచలన విషయముగా చరిత్రలో చోటు చేసుకుంది.

1976వ సంవత్సరములో ఫ్రాన్స్‌లోని కొంతమంది నిద్రపట్టని వ్యాధితో బాధపడేవారు 'జాక్సేనగట్' అనే హిప్నాథెరపిస్ట్ దగ్గఱకు వచ్చారు ఎన్నోరకాల మందులు వాడినా ప్రయోజనములేదని చెప్పారు వారి పరిస్థితిని గమనించిన జాక్సే-హిప్నాటిజము ద్వారా అందఱినీ మూకమ్మడిగా నిద్రపుచ్చాడు. రోజూ కొంత సమయము ఇలా వాళ్ళని హిప్నాటిజము ద్వారా నిద్రపుచ్చడం వలన మానసికముగా వాళ్ళెంతో కోలుకున్నారు. తర్వాత కూడా ఆ సమయానికి నిద్రపట్టే అలవాటు కలిగింది.

# మన మాటలను వింటున్న చెట్లు !

"మీరు చెట్లతో మాట్లాడండి-మీ మాటలు చెట్లు వినగలవు, అర్థము చేసికోగలవు" అంటున్నారు కొందరు వృక్ష శాస్త్రజ్ఞులు.

ఈ మధ్య వృక్ష శాస్త్రజ్ఞుల సమావేశ సభలో-చెట్లుకూడా అనేక అనుభూతులకు లోనవుతాయని, మన మాటలను అర్థము చేసుకుని స్పందిస్తాయని ఆ సభలో శాస్త్రజ్ఞులు సూచించారు.

భారతీయ సంస్కృతిలో చెట్లను పూజించడము కూడా ఓ ప్రముఖమైన ఆచారముగా వుంది. చాలామంది నిత్యము'తులసి' చెట్టును పూజించటము మనకు తెలిసిందే.

రాజస్థాన్‌లోని స్త్రీలు-జూన్ నెలలో ఒక నిర్ణీత దినాన 'మట్టి' చెట్టును పూజిస్తారు పూజ అనంతరము "ఓ మహావృక్షమా! నా భర్తని అన్ని ఆపదల నుండి రక్షింపుము, అతన్ని అదృష్టశాలిని చేయుము ప్రతి ఏటా నిన్ను ఇలాగే పూజిస్తాను" అని బిగ్గరగా వేడుకుంటారు.

ఆ మట్టి చెట్టు వాళ్ళ మాటలను వింటుందని, వారికి శుభములను కలుగజేస్తుందని అక్కడి ప్రజల నమ్మకము.

కాలిఫోర్నియాలోని లూదర్ అనే శాస్త్రవేత్త వృక్ష శాస్త్రములో ఎన్నో పరిశోధనలు చేసాడు. ఈయన ప్రత్యేక శ్రద్ధతో 'నాగజెముడు' చెట్లను పెంచుతున్నాడు నాగజెముడు చెట్టునిండా ముళ్ళు ఉండుట దాని సహజ లక్షణము. కానీ లూథర్ పెంచే నాగజెముడు చెట్లకు ముళ్ళు ఉండవు. అదే ప్రత్యేకత!

లూథర్ వాడే విత్తనాలు మామూలివే. అయితే-అతడు నాగజెముడు మొక్కలకు ప్రతిరోజూ నీళ్ళుపోస్తూ- 'ఇతరులను బాధించే ముళ్ళు మీకు అవసరములేదు. నేను మీకు ఏ ఆపదా రాకుండా కాపాడుతాను' అనేవాడట. ఆ మాటలను అర్థము చేసుకున్న నాగజెముడుచెట్లు ముళ్ళు లేకుండా పెరుగుతున్నాయట. ప్రపంచము మొత్తము మీద ముళ్ళులేని నాగజెముడు చెట్లు పెరుగుతున్నది లూథర్‌గారి తోటలోనే, ఈ వింతని చాలామంది ప్రత్యేకంగా చూడటానికి వెళుతుంటారు.

1900వ సంవత్సరములోని ప్రఖ్యాత భారతీయ శాస్త్రవేత్త జగదీశచంద్ర ప్రసాద్ వృక్షాలకు ఇరవై విధాలైన గ్రాహ్యశక్తి ఉంటుందని....నరాల సముదాయము లేకపోయినా అవి శ్వాసిస్తాయి, అహారాన్ని జీర్ణము చేసుకుంటాయి, కండరాలు లేకపోయినా కదలగలుగుతున్నాయని ప్రకటించాడు.

ప్రాణమున్న జీవాలు ఎండ తీవ్రతకు వాడిపోతాయి. అలాగే చెట్లు కూడా అధిక వేడిమికి వాడిపోతాయి క్లోరోఫాము వాసనకి ప్రాణులు మూర్ఛపోతాయి. చెట్లు కూడా అధిక వేడిమికి వాడిపోతాయి.

"డొరోతీ" అనే మహిళా వృక్ష శాస్త్రవేత్త 1968వ సంవత్సరములో మొక్కలమీద కొన్ని ప్రత్యేక ప్రయోగములు చేసి సంగీతానికి, వాయిద్యాల శబ్దాలకు చెట్లు స్పందిస్తాయని సూచించారు. పల్లెల్లో-పంట పొలాల్లో కార్మికులు, పొలాల పనులు చేస్తూ పాడుకునే జానపద పాటల వలన మొక్కలు స్పందిస్తాయని, అవి ఉత్సాహముగా పెరిగి మంచి పంటను అందిస్తుయని ఆమె చెప్పారు. ఇంటి ఆవరణలో పెరిగే మొక్కలు చక్కని శ్రావ్యమైన సంగీతము వలన బాగా హుషారుగా పెరుగుతాయని, రోత పుట్టించే అధిక శబ్దాలకు, వాయిద్యాలకు చెట్లు వాడిపోతాయి. ఆ శబ్దాన్ని అవి భరించలేకపోవటమే అందుకు కారణము అంటుంది డొరోతీ!

న్యూజెర్సీకి చెందిన 'పిర్రేపాల్' అనే టెలిఫోన్ ఇంజనీర్‌కి మొక్కలంటే చాలా ఇష్టము. అయన ప్రతిరోజూ ఉదయాన్నే మొక్కలకు పాదులు త్రవ్వుతూ, నీళ్ళుపోస్తూ ఒక్కొక్క మొక్కతో మాట్లాడి వాటి కష్టసుఖాలు తెలుసుకుని వస్తాడు. చాలా మంది అతన్ని పిచ్చోడిగా భావిస్తారు. కానీ-పిర్రేపాల్ మాత్రము 'నా మాటలను మొక్కలు వింటున్నాయి. వాటి ప్రతి స్పందనను కూడా నేను అర్థము చేసుకుని వాటి పరిస్థితిని గమనించగలను' అంటాడు.

మనము తోటలో పెంచుకునే మొక్కలు- మనము చూపించే స్నేహము వలననే ఉత్సాహముతో గుబురుగా, అందముగా పెరగగలుగుతున్నాయి. మన సేవ, ప్రేమ ఇందుకు సగము కారణమవు

తూంది-అవి జర్మనీకి చెందిన 'ఫ్రాంకాన్', రష్యాకి చెందిన 'పొటో విటోనే' అనే వృక్ష శాస్త్రవేత్తలు కొన్ని వ్యాసాల్లో వ్రాసారు.

## ప్రమాదకరమైన 'పాతర'

ప్రపంచములో జనాభా వద్దనుకున్నా పెరుగుతూనే వుంది. వైజ్ఞానికముగా కూడా ఎంతో అభివృద్ధి చెందింది. ఈ పరిస్థితులలో అణు ఇంధనాన్ని మంచికి, చెడుకీ రెండిటికీ వాడుతున్నారు. ఈ అణుశక్తి రంగములో పుట్టే వ్యర్థ పదార్థాలను ఏమి చెయ్యాలనే సమస్య అమెరికా లాంటి పెద్ద దేశాలకు పెద్ద సమస్యగానే తయారయింది ఎందువలనంటే అణుశక్తివలన పుట్టే వ్యర్థ పదార్థాలలో ఎక్కువ శాతము ఉండేది 'ప్లుటోనియము' అనే అణు ధార్మికతగల మూలకము, ఇది చాలా ప్రమాదకరమైనది. దీన్ని జాగ్రత్త చేయటము చాలా కష్టతరమైనది

అమెరికాలో కరెంట్‌తో పాటు బాంబులు కూడా తయారు చేస్తున్నారు కాబట్టి అక్కడ అణు ఇంధనము వాడుక చాలా ఎక్కువైపోయింది. ఇప్పటికి 20,000 మెట్రిక్ టన్నుల హానికారక వ్యర్థ పదార్థము వెంటపడింది. ఈ ప్రమాదకరమైన వ్యర్థ పదార్థము ప్లుటోనియము ఏదో....కొంత కాలానికి సమసిపోయేదయితే పెద్దగా సమస్యేమీ లేదుగానీ- ఇవాళ తయారయిన ప్లుటోనియము మరో ఇరవై నాలుగువేల సంవత్సరముల వరకూ అమిత హానికరమైన రేడియో ఆక్టివ్ కిరణాలను వెదజల్లుతూనే ఉంటుంది. కాబట్టి....దీన్ని బాగా లోతునభూమిలో పాతిపెట్టడము కన్నా మరో మార్గం లేదని కొందరు శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు.

అయితే.... పాతిపెట్టడము అనేది ఏమంత పెద్ద పని కాదు.... చాలా సులభమే! కానీ....పాతిపెట్టబడే ప్రదేశములో జలాశయాలు ఉండకూడదు, భూకంపాలు రాకూడదు, అగ్నిపర్వతాలు ఉండకూడదు, జనవాసాలు అంతకన్నా ఉండకూడదు. ఇటువంటి ప్రదేశాలు ఎక్కడ

దొరుకుతాయి? అమెరికా మొత్తము గాలించి ఆఖరికి మూడు అనువైన ప్రదేశాలను కనుగొన్నారు. ఈ మూడింట ఒకటి మాత్రమే అన్నివిధాలా అనుకూలమైనదిగా భావించి, ఆ ప్రదేశములో ప్లూటోనియం మూలకాన్ని పాతర వేయడానికి నిర్ణయించుకున్నారు.

అణు ఇంధనము పాతరకు సంబంధించి ఏయే జాగ్రత్తలు అవసరము అనేది వాతావరణ పరిరక్షణ సంస్థ, అణు నియంత్రణ సంస్థల వారు ఆలోచిస్తున్నారు.

వీరు ప్లూటోనియమ్‌ను కనీసము పది సంవత్సరాల పాటైనా బయట పడకుండా ఉండేలా చేయాలనుకునే జాగ్రత్తలు తీసుకుంటున్నారు. ముందు– పదివేల సంవత్సరాలు దాని ప్రమాదం లేకుండా చేస్తే ఆ తర్వాత సంగతి దేవుడెరుగు అనే నిర్ణయానికి వచ్చారు ఈ విషయము మీద ఇంకా పరిశోధనలు జరుగుతున్నాయి. 1998వ సంవత్సరములో ఈ 'పాతర' కార్యక్రమము మొదలు కావొచ్చు.

'నెవాడా'లోని యుకా కొండలలో 1,500 ఎకరాల స్థలములో సొరంగాలు త్రవ్వుతారు అణు ఇంధనాన్ని గట్టి గొట్టాలలో బిగించి భూస్థాపితము చేస్తారు. అక్కడ త్రవ్విన సొరంగాలన్నీ నిండిన తరువాత ఆ సొరంగాలను శాశ్వతంగా మూసేస్తారు.

అణుశక్తి వ్యర్థ పదార్థాలను ముందుగా గాజు బుడ్డీలలో బిగిస్తారు. వాటిని గట్టి స్టీల్ డ్రమ్ములలో సీల్ చేస్తారు. ఈ డ్రమ్ములు మూడు వందల నుండి వెయ్యి సంవత్సరాల దాకా ఇంధనాన్ని పట్టి ఉంచగలవు. ఆ తర్వాత బాధ్యత కొండలదే!

యుకా కొండలు కోటి సంవత్సరాలనాడు జరిగిన అగ్ని పర్వతాల విస్ఫోటం వలన ఏర్పడినవి కాబట్టి కొంతకాలము 'పాతర'కు రక్షణ కల్పించగలవని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. అయితే- యుకా కొండలలోని అక్కడక్కడా భూకంపాలు వచ్చే అవకాశాలున్నాయని తెలుసుకున్నారు. ఈ ప్రాంతానికి 15 కిలో మీటర్ల దూరములోనున్న చిన్న అగ్నిపర్వతము 5000 సంవత్సరాల నాడు పేలిందట! మళ్ళీ.... మరో పదివేల సంవత్సరాల లోపు అది పేలవచ్చని కొందరు శాస్త్రజ్ఞులు

గట్టిగా అనుమానాన్ని వ్యక్తము చేస్తున్నారు. అయినా....అంతకుమించి పాతరకు మరో మంచి ప్రదేశము లేదు కాబట్టి...'పాతర'కార్యక్రమము మొదలు కావచ్చు!!

## 'మానభంగాల సన్యాసి'

మనదేశములో బాబాజీలకు, గురూజీలకు కొదవలేదు కాషాయము ధరించిన ప్రతి ఒక్కరినీ గౌరవించే భారతీయుల బలహీనతలవల్ల వారి సంఖ్య పెరుగుతోంది ప్రతి గ్రామము చివర ఒక మఠము, అందులో బైరాగులుండడము మన గ్రామప్రాంతాలలో కన్పిస్తుంది. ఇక సుందర, పవిత్ర ప్రదేశాలలో ఆశ్రమాలు ఏర్పరుచుకుని ఆధ్యాత్మిక బోధనలు చేసేవారి సంఖ్య ఇటీవల పెరిగింది. ఇతర రంగాలలో మేధావులు, రాజకీయవేత్తలు ఆదరించడముతో సామాన్యులుకూడా వారిని గౌరవిస్తు న్నారు.

ఫలితముగా వారికి సౌకర్యాలు పెరుగుతున్నాయి. పలుకుబడి ఎక్కువవుతోంది

అయితే కాషాయము వేసుకున్నంత మాత్రాన మనసు, ఆలోచ నలు పవిత్రముగా మారవని గతములో ఎన్నోసార్లు నిజమైనది. అటు వంటి కథే తిరిగి పవిత్ర ద్వారకలో మరోసారి బగ్గుమంది.

పదిహేను సంవత్సరాలుగా ద్వారకా నగరములో ఆశ్రమము ఏర్పరచుకుని చుట్టుపక్కన గ్రామాల ప్రజలకు ఆదర్శమూర్తిగా వున్న స్వామి కేశవానంద అసలు రూపము జూన్ నెలలో బయటపడింది.

ఆశ్రమము మాటున ఆయన చేస్తున్న ఆడపిల్లల శరీరాల వ్యాపా రము బట్టబయలయ్యేసరికి, ఆ ప్రాంత ప్రజలు ఒక్కసారిగా విరుచుకు పడి 'స్వామీజీ'ని తరిమికొట్టారు. సరయిన సమయానికి పోలీసులు అరెస్టుచేసి వుండకపోతే ద్వారక ప్రజలు అతని అంతు చూసుండే వారేమో?

## సాదా సీదా మనిషి

స్వామీ కేశవానంద్‌గా ప్రజలకు పరిచితుడైన ఆ కాషాయ రూపములోని కసాయి అసలు పేరు కమలనాధ్ విశ్వంబరనాధ్. బీహార్ రాష్ట్రంలోని నలంద జిల్లాకి చెందిన గోకుల్‌పూర్ గ్రామములో సాధారణ రైతుకుటుంబములో పుట్టాడు

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్నట్టు కమలనాధ్ బుద్ధి 15వ ఏటనే బయటపడింది. ఆ గ్రామములోని ఒక వ్యక్తి భార్యను తనతో లేపుకొని తీసుకుపోతుండగా పట్టుబడి దేహశుద్ధి చేయించుకున్నాడు

ఆ తర్వాత ఆ గ్రామములో ముఖంచెల్లక బీహార్ షరీఫ్ ప్రాంతములో వున్న బారీమఠము అధిపతి స్వామీ హరినారాయణానంద్ దగ్గర శిష్యుడిగా చేరాడు.

ఆయన సన్యాసము ఇచ్చినా కమల్‌నాధ్‌ని చదువుకోమని బాగా ప్రోత్సహించాడు. ఆ విధముగా 1970లో పాట్నా కాలేజీలో డిగ్రీ పూర్తి చేశాడు. ప్రస్తుత బీహార్ ముఖ్యమంత్రి లల్లూప్రసాద్ యాదవ్ అయనకి సహాధ్యాయి, మంచి స్నేహితుడు.

1977లో ఎలా వెళ్ళాడోకానీ ఇంగ్లండ్ వెళ్ళాడు వెళ్ళేముందే తాను సంస్కృతములో ఎమ్.ఎ. చేశానని చెప్పుకుంటున్నాడు ఆయన. అదే సంవత్సరము తిరిగి భారతదేశానికి వచ్చి నేరుగా ద్వారక వెళ్ళి అక్కడ ఆశ్రమము ఏర్పరచుకున్నాడు.

## ప్రముఖుల అండ

స్వామి కేశవానంద్‌గా మారిన కమల్‌నాధ్ ఆశ్రమము అభివృద్ధికి, ఆయన పలుకుబడి పెరగడానికి పలువురు ప్రముఖులు తోడ్పడ్డారు.

ప్రఖ్యాత సిమెంట్ కంపెనీ ఐ.సి.సి. వారు ఆశ్రమానికి కావాల్సిన స్థలాన్ని లీజుకి ఇప్పించారు.

ద్వారక ప్రాంతపు రాజకీయ నాయకుల ఆదరణ తోడవగా స్వామీజీ సనాతన సేవామండలి పేరుతో విశాలమైన ఆశ్రమాన్ని నిర్మించుకున్నాడు. పది ఎకరాల స్థలముగల ఆ ఆశ్రమాన్ని ఆనాటి గుజరాత్ గవర్నర్ శారదాముఖర్జీ ఆరంభించింది.

ఆశ్రమములో అనాథ బాలికలకోసము ఒక ప్రత్యేక వసతి గృహము, వారికి చదువు చెప్పేందుకు ప్రత్యేక పాఠశాల వున్నాయి. అక్కడ అనాథస్త్రీలు బయటకు రావాల్సిన అవసరములేనట్టుగా సౌకర్యాలు కల్పించబడ్డాయి. అందుకే ఆశ్రమము లోపల జరుగుతున్న అక్రమాలు బయటకు రావడానికి అంతకాలము పట్టింది.

## పలుకుబడితో పదిలము

స్వామీజీ ఆశ్రమములో అమ్మాయిలమీద అత్యాచారాలు జరుగుతున్నాయనే అనుమానము 1990లోనే కలిగింది. ఆ ప్రాంతపు బి జె.పి. శాసనసభ్యులు బహిరంగముగానే స్వామీజీమీద ఆరోపణలు చేశారు.

అయితే ఆ ఆరోపణలను ప్రభుత్వము పట్టించుకోలేదు పైగా స్వామీజీ వ్యక్తిత్వాన్ని దెబ్బతీశారని ఆయన సోదరుడు బీహార్ రాజధాని పాట్నా కోర్టులో కేసు పెట్టాడు. కోర్టు సమన్ల ప్రకారము పాట్నా వెళ్ళిన ఆ బి.జె పి. నాయకులను చితకబాదించారు.

గత నాలుగు సంవత్సరాలుగా అనుమానము వున్నప్పటికి స్వామీజీమీద పోలీసులు చర్య తీసుకోలేకపోవడానికి ప్రధాన కారణము ఆయనకున్న రాజకీయ పలుకుబడి, గుజరాత్ ప్రభుత్వములోని అనేక మంది మంత్రులు ఆయన శిష్యులు.

1990-93 మధ్యలో ఆ రాష్ట్ర ముఖ్యమంత్రిగా పనిచేసిన చిమన్ భాయ్‌పటేల్ భార్య ఊర్మిళ ఆయనకు శిష్యురాలు. 1990 ఎన్నికల్లో ఆమె పోటీ చేసినప్పుడు ఆమె ఎన్నికల ప్రచార కేంద్రాన్ని ఆరంభించినది కేశవానంద్ స్వామీజీయే.

ఎన్నికల ప్రచారానికి వచ్చిన ప్రస్తుత ప్రధాని పి వి నరసింహా రావుకి ద్వారకలో మొదటి దండ వేసి స్వాగతం పలికింది కేశవానంద్ స్వామీజీ

స్వామీజీకి ఇందిరాగాంధీ, మొరార్జీ దేశాయ్, జయప్రకాష్ నారాయణ వంటి వ్యక్తులతో పరిచయముందని చెప్పే ఫోటో సాక్ష్యాలున్నాయి ఆయన ఆశ్రమాన్ని సందర్శించిన ప్రముఖుల్లో బాబా ఆమ్టే, మహంత్-అవైద్యనాధ్, టాటా కెమికల్స్ కంపెనీ ఛైర్మన్ దర్మారా సేట్, ద్వారక శంకరాచార్య, మాజీ బీహార్ ముఖ్యమంత్రి జగన్నాధ్ మిశ్రా, గుజరాత్ మాజీ ముఖ్యమంత్రి ఛబ్బిల్‌దాస్ మెహతా మొదలయిన వారున్నారు.

ఇంతమంది ప్రముఖులు కేశవానంద్‌తో మాట్లాడినా ఆ మనిషిలో దాగున్న మృగాన్ని గుర్తించలేకపోయారు పైగా ఆయనెంతో చక్కగా మాట్లాడతాడని, ఆయనకెంతో పరిజ్ఞానముందని కితాబులిచ్చారు. అందరు ప్రముఖులు ఆయనముందు చేతులు కట్టుకు నిలుచుంటున్నప్పుడు ఇక సామాన్యుల సంగతి వేరే చెప్పేదేముంది?

ద్వారక ప్రాంతముకుండే కాకుండా గుజరాత్‌లోని ఇతర ప్రాంతాల ప్రజలు స్వామీజీ ఆశ్రమానికి ఆర్థిక సహాయము అందించడమే కాక వారి వారి ప్రాంతాలలోని అనాధ బాలికల్ని పంపించారు. ఆ ఆశ్రమములో పసిపాపలనుండి ఇరవైఏళ్ళ పైబడిన అమ్మాయిల వరకు వున్నారు

## కామాంధుడు

స్వామీజీ కంటికి నచ్చిన అమ్మాయిలు ఆయన గదికి చేరాల్సిందే నంటున్నారు ఆశ్రమ అమ్మాయిలు ముందుగా ఒళ్ళుపట్టమని పిలిచేవాడు. అలా శరీరముమీద అమ్మాయిల చేతులు కదులుతుండగా స్వామీజీ చేతులు అమ్మాయిల అందాలను తడుముతుండేవి.

వయసుచేసే ఆల్లరికి కొందరు అమ్మాయిలు సులభముగా లొంగి పోతే, స్వామీజీమీద భక్తితో కొందరు సమర్పించుకుని అదొక పుణ్య కార్యముగా పొంగిపోయేవారు. స్వామీజీ చేష్టలను వ్యతిరేకించిన వారిని బలవంతముగా అనుభవించేవాడట.

"సెక్స్‌లో స్వామీజీ వికృతముగా ప్రవర్తించేవాడంటారు" అమ్మాయిలు. పలురకాల భంగిమలకు బలవంతము చేసేవాడని, అందులో ఆశ్రమ పాఠశాలలో పనిచేసే ఉపాధ్యాయినుల పాత్రకూడా వుందని ఇప్పుడు వెల్లడయింది. స్వామీజీ ముందుగా తనలోని సెక్స్ పరమైన కోర్కెలను టీచర్లమీద తీర్చుకునేవాడు.

శిష్యురాళ్ళుగా చేరిన టీచర్లకు 'గృహమాత'లుగా పేరుపెట్టి బాధ్యతలు అప్పగించేవాడు. గృహాన్ని తీర్చిదిద్ది, గృహస్థుల అవసరాలు తీర్చడము 'గృహమాత' బాధ్యత. ఆశ్రమములోని పిల్లల బాధ్యతతో పాటు స్వామీజీ అవసరాలు తీర్చాల్సిన బాధ్యత మీదేనంటూ వారిని క్రమముగా లొంగదీసుకునేవాడు

ఆ రహస్యము బట్టబయలు చేస్తానని వారిని బెదిరిస్తూ, అందుకు ప్రతిఫలముగా ఆశ్రమములోని అమ్మాయిలకు నచ్చజెప్పి వారిని తన వద్దకు పంపడములో వారి సహాయము తీసుకునేవాడు అలా స్వామీజీకి కోరికలు తీర్చడములో సహకరించిన స్కూల్ ప్రధానోపాధ్యాయిని రక్షపద్మ, గృహమాత హేమాశర్మలు ప్రస్తుతం పోలీసు కస్టడీలో వున్నారు.

## తీగలాగితే...

ఆ ఆశ్రమములో స్వామీజీ అత్యాచారానికి గురైన ఆడపిల్లల సంఖ్య రెండువందలదాకా వుంది అదే ఆశ్రమములో వంటమనిషి అంజనమీద అత్యాచారము జరిగినప్పుడు ఆమె రాతపూర్వక ఫిర్యాదు నిచ్చినా పోలీసులు పట్టించుకోలేదు. పాపాత్ముడి పాపము పండితే కానీ

బయటపడదన్న సూక్తి ప్రకారము స్వామి కేశవానంద్ కామలీలలు జూన్ నెలలో బయటపడ్డాయి.

స్వామీజీ అత్యాచారానికి గురైన 22 ఏళ్ళ గీత అనే అమ్మాయి గర్భవతి అయింది. సాధారణముగా తనవల్ల గర్భవతులయిన వారంద రికి గర్భస్రావము చేయించడము స్వామీజీ రివాజు. అయితే గీతకు ఏడో నెల వచ్చేవరకు గర్భవతని గుర్తించని స్వామీజీ అప్పుడు హడావుడిగా ఆసుపత్రికి పంపాడు.

స్వామీజీ చేసే పాపాలను కడిగివేసే డాక్టర్ అక్షయ్ బెహరా గీత గర్భము ఏడోనెలలో వున్నా, గర్భస్రావ యత్నము చేశాడు. ఫలితముగా ఆమెను ప్రాణాపాయ స్థితిలో ప్రభుత్వ ఆసుపత్రికి తరలించగా మరణించింది. చట్టవిరుద్ధ గర్భస్రావ నేరానికి అరెస్టయిన డా॥ అక్షయ్ తనకు గర్భస్రావాలు కొత్తకాదని, ఇప్పటికి కొన్నివందలు చేశానని గర్వంగా చెప్పుకున్నాడు.

అంత చిన్న పట్టణములో ఒకే వైద్యుడు వందకు పైగా గర్భస్రావాలు చేయవలసిన అనుమానము కలిగి అనేక విధాలుగా అతడ్ని ప్రశ్నించగా, ఆ గర్భస్రావాలన్నీ స్వామీజీ ఆశ్రమములో అమ్మాయిలకు చేసినవేనని చెప్పేశాడు.

## పాత పాపాలు

స్వామి కేశవానంద్ [illegible] చూచాయగా తెలిసిన సాక్ష్యము కోసము వెతుకుతున్న పోలీసులకు డా॥ అక్షయ్ మాటలు ఆసరాగా దొరికాయి. అత్యాచారానికి గురై ఆశ్రమము వదిలి వెళ్ళిపోయిన అమ్మాయిల చిరునామాలు సేకరించి, వారినుండి మిగిలిన సమాచారము సేకరించారు. ఈలోగా స్వామీజీకి అమ్మాయిలను సరఫరాచేసి, చివరికి 'ఈ రాత్రికి నువ్వే కావా'లన్న ఆయన ఉత్తర్వుకు భయపడిన ఒక టీచర్ కూడా పారిపోయి వచ్చి పోలీసుల శరణు కోరింది.

అత్యాచారాలకు గురయిన పిల్లల పేర్లు సేకరించి, ధైర్యముచెప్పి వారిచేత పోలీసులకు ఫిర్యాదు చేయించడములో ప్రముఖపాత్ర వహించింది కస్తూరిబాస్త్రీ, వికాసగృహ అధ్యక్షురాలు మంజులాబెన్‌దావె. ఆమెకూడా కొంతకాలము స్వామీజీకి శిష్యురాలే అయితే క్రమముగా ఆయన చర్యలమీద అనుమానము కలిగి అక్కడినుండి తప్పుకుంది.

## కటకటాల వెనక్కి

పదిహేనురోజుల పరిశోధన తర్వాత తగినన్ని సాక్ష్యాధారాలతో ఆశ్రమముమీద పోలీసులు దాడిచేశారు. స్వామీజీకి లక్షలాది రూపాయల ఆస్తులున్నట్టు తెలియచేసే సాక్ష్యాలు దొరికాయి. స్వామీజీ బీహార్‌లోని తన స్వగ్రామములో పెద్ద బంగళా కట్టించాడు. కొన్ని లక్షల రూపాయల విలువచేసే షేర్ సర్టిఫికెట్లు, ఇందిరా వికాస్ పత్రాలు, 25 బ్యాంకుల్లో డిపాజిట్స్ వున్న పాస్‌బుక్స్, ఒక వి.సి.ఆర్. కొన్ని క్యాసెట్స్ పోలీసుల దాడిలో దొరికాయి

స్వామీజీ పాస్‌పోర్ట్ ప్రకారము ఆయన వయసు 48. అయితే తన వయసు అరవై వరకు వుంటుందనేది ఆయన వాదన. ఆ వయసులో అత్యాచారాలు చేయలేరని వాదించేందుకు వీలుగా అలా చెప్పుకుంటున్నాడని పోలీసుల అనుమానము. ఆయన పలు విదేశీ ప్రయాణాలు చేశాడనేందుకు పాస్‌పోర్ట్ సాక్ష్యం. విదేశాలలో కూడా ఆయనకు శిష్యులున్నట్టు ఉత్తరాలు తెలియజేస్తున్నాయి ఆయన విదేశీ ప్రయాణాల వెనక స్మగ్లింగ్, విదేశీమారకద్రవ్య రవాణా వంటివి వున్నాయేమో పరిశోధిస్తున్నారు పోలీసులు.

తన రాజకీయ పలుకుబడితో అరెస్టు తప్పించుకోవాలని స్వామీజీ ప్రయత్నించాడు.

అయితే అప్పటికే స్వామీజీ రహస్యము గుజరాతీ పత్రికలు బట్టబయలు చేయడముతో వారు జోక్యము చేసుకునేందుకు వెనుకాడారు.

ఫలితముగా స్వామీ కేశవానంద్ జ్యూడిషియల్ కస్టడీకి పంపబడి కట కటాలు లెక్క పెడుతున్నాడు. ఆయనతోపాటు పాపాలన్నింటిలో పాలు పంచుకున్న స్వామీజీ వ్యక్తిగత కార్యదర్శి రవీంద్ర చౌబేని కూడా అరెస్టు చేశారు. ఆయన తరఫున వాదించి బెయిల్‌మీద బయటకు తెచ్చేందుకు ఒక్క న్యాయవాదికూడా ముందుకు రాలేదు.

పవిత్రమైన మతధర్మాలకు ఇటువంటి దొంగ స్వామీజీలే మచ్చ తెస్తారు భయము, మూఢనమ్మకము బంధనాలనుంచి తొలగితేనే ఇటు వంటివారికి బుద్ధి చెప్పగలము.

# పన్నెండేళ్ళ గజ ఈతగాడు

పన్నెండేళ్ళ కుట్రాలీశ్వరన్ పాక్ జలసంధిలో ఆ ఒడ్డునుంచి ఈ ఒడ్డుకి ఈదిన అతి పిన్న వయస్కుడిగా రికార్డు సృష్టించాడు. 1994 ఏప్రిల్ 12 న కుట్రాలీశ్వరన్ పదహారు గంటల్లో ఆ ఘన కార్యాన్ని సాధించాడు.

ఇంతవరకూ ఈత కొడుతూ భారతదేశము, శ్రీలంకలమధ్య వున్న పాక్ జలసంధిని దాటినవారు ఆరుగురే. వారు పశ్చిమ బెంగాల్‌కి చెందిన మిహిర్ సేన్, వైద్యనాథ్ మహారాష్ట్రకి చెందిన కురుస్ కంట్రాక్టర్ తారానాథ్ షెనాయ్ విదేశీయుల్లో శ్రీలంకకి చెందిన శ్రీ కుమార్ ఆనందన్ కె నవరత్నస్వామి. అయితే వారందరూ వయసులో కుట్రాలీశ్వరన్ కంటే చాలా పెద్దవాళ్ళు.

ఈ గొప్పపనులు చేయటానికి, వయసుకి సంబంధం లేదని కూడా కుట్రాలీశ్వరన్ నిరూపించాడు.

## అద్భుతవిజయము

కుట్రాలీశ్వరన్ మరోగొప్పతన మేమిటంటే, అతను మిహిర్ సేన్ (25 గంటలు పట్టింది) కన్నా తక్కువ సమయములో పాక్ జల

సంధిని దాటాడు. వైద్యనాథ్‌కి కుట్రాళీశ్వరన్‌లా అందుకు 16 గంటలే పట్టింది. కురుస్ కాంట్రాక్టర్ (12 గంటల 28 నిమిషాల 40 క్షణాలు) తారానాథ్ షెనాయ్ (13 గంటలు)తో పోలిస్తే కుట్రాళీశ్వరన్ ఈత కొట్టిన వేగము తక్కువే.

అయితే అప్పటి వాతావరణము సముద్రములోని అలల తీరుని దృష్టిలో వుంచుకుంటే పన్నెండేళ్ళ ఆ బాలుడికి ఓ అద్భుత విజయమే.

## ఎన్నో ఏర్పాట్ల మధ్య

మద్రాసుకి చెందిన కుట్రాళీశ్వరన్ పాక్ జలసంధిలో ఈత కొట్టటాన్ని తమిళనాడు స్పోర్ట్స్ డెవలప్‌మెంట్ అథారిటీ, రామనాథపురము జిల్లా యంత్రాంగము కలిసి ఏర్పాటు చేశాయి. అందుకు భారత నావికాదళము భారతతీర ప్రాంత రక్షణ దళము, శ్రీలంక తీరప్రాంత రక్షణదళము ఎంతో సహాయపడ్డాయి. కుట్రాళీశ్వరన్ సముద్రములో ఈదినప్పుడు వారి నౌకలు అనుసరించి వెళ్ళాయి. వాటితోపాటు గ్రెనెడ్స్, షార్కుల్ని చూడగానే నిరోధించే పరికరాలతో కూడిన నాలుగు ట్రాలర్లు. ఓ నాటుపడవ, నేవీకి చెందిన లైఫ్ బోటు కూడ వున్నాయి. నేవీకి నౌకలో కుట్రాళీశ్వరన్ తల్లిదండ్రులు ప్రయాణించారు. కుట్రాళీశ్వరన్ కోచ్ వీరభద్రన్‌తో పాటు మరో ఆరుగురు ఈతగాళ్ళు మొదటి నుంచీ చివరి వరకూ ఇద్దరు చొప్పున వంతుల వారీగా ఆతనికి తోడుగా సముద్రములో ఈదారు. వారు నాటుపడవలో ప్రయాణించారు. లైఫ్ బోటులో నేవీకి చెందిన యిద్దరు ఈతగాళ్ళు అవసరమైతే సాయపడ్డానికి వున్నారు!

## శ్రీలంకనుంచి ఇండియాకు

శ్రీలంకలోని తలైమన్నార్‌లో అర్ధరాత్రి దాటాక 1 10కి కుట్రాళీశ్వరన్ సముద్రములో ప్రవేశించాడు. అప్పుడు సముద్రపుటలలు ఉధృతముగా వుండడంతో అతనికి ఈత కష్టమైనది. దానివల్ల అతను మరో అయిదు కిలోమీటర్లు అదనముగా ఈదాల్సి వచ్చింది.

కొంతదూరము తర్వాత సముద్ర జలాలు ప్రశాంతముగా వున్నా, మళ్ళీ తమిళనాడులోని ధనుష్కోడివద్ద సముద్రము మహా తీవ్రముగా వుంది అలల తీవ్రతను తట్టుకుంటూ సాయంత్రము 5.10కి కుట్రాళీశ్వరన్ ధనుష్కోడి చేరాడు.

మొత్తముమీద అతను 16 గంటల్లో 37 కిలోమీటర్లు ఈదాడు. అనుకున్న ప్రకారము విజయవంతముగా ఈతకొట్టిన కుట్రాళీశ్వరన్‌కి ఒడ్డుకు చేరగానే తమిళనాడు విద్యామంత్రి పొన్నుస్వామి ఇతర ప్రముఖులనుంచి ఘనస్వాగతము లభించింది.

విద్యామంత్రి అభినందన సూచకంగా కుట్రాళీశ్వరన్‌ని పైకెత్తి, అతని చేత్రికి జాతీయ జెండాను అందించాడు. జెండాను పట్టుకొని కుట్రాళీశ్వరన్ హుషారుగా సముద్రములో కొంతదూరము పరుగెత్తాడు. "ఇది సాధించినందుకు నాకెంతో సంతోషముగా వుంది తర్వాత ఇంగ్లీష్ ఛానల్‌ని ఈదాలని నా ఆశ" అని చెప్పాడు.

## ధైర్యము పట్టుదలల ఫలితము

తమిళనాడు జలక్రీడల అసోసియేషన్ అధ్యక్షుడు కుట్రాళీశ్వరన్‌ని అభినందిస్తూ, "ధైర్యము, పట్టుదల, కఠోరమయిన శిక్షణ, అంకిత భావము, తల్లిదండ్రుల ప్రోత్సాహం, కోచ్‌ల మార్గదర్శకత్వాల ఫలితమే కుట్రాళీశ్వరన్ సాధించిన ఈ అసాధారణ కార్యము యిది చూశాకయినా యువతలో సాహసాల్ని చేసే ఉత్సాహము అభివృద్ధి కావాలి పోటీవున్న క్రీడలలో అంతర్జాతీయస్థాయిని లక్ష్యంగా పెట్టుకునేటట్లు వారిని ప్రోత్సహించాలి" అన్నాడు.

ఎనిమిదేళ్ళ వయసులో ఈదడము ప్రారంభించిన కుట్రాళీశ్వరన్ నాలుగేళ్ళలో బ్రహ్మాండముగా వృద్ధిచెందాడు. ఆతనిలో గొప్పపనులు సాధించడాని కవసరమయిన అంకితభావము, ధైర్యము, పట్టుదలలాంటి మంచి లక్షణాలన్నీ వుండడంవల్లే ఇది సాధ్యమయింది అతను లోగడ కూడా వివిధ ప్రాంతాలలో ఎన్నో స్విమ్మింగ్ పోటీలలో పాల్గొని పేరు తెచ్చుకున్నాడు.

## గురువుని మించిన శిష్యుడు

తమిళనాడు స్పోర్ట్స్ డెవలప్‌మెంట్ అథారిటీ గత ఏడాది డిసెంబర్ నుంచీ అతనికి నెలకి వెయ్యిరూపాయల గ్రాంటు అందజేస్తూ శిక్షణ పొందడానికి అవసరమయిన ఇతర ప్రోత్సాహాన్ని కల్పించింది. కుట్రాళీశ్వరన్ ఈ విధముగా కొత్త రికార్డు సృష్టించడానికి ముందు 45 రోజులపాటు స్వల్ప విషయాన్ని కూడా విస్మరించకుండా, ప్రత్యేకమయిన కోచింగ్ యిచ్చిన వీరశ్రీధన్, "పాక్ జలసంధిలో కూడా ఇప్పుడు కొంత సేపటికి అతనితో సమానముగా ఈదలేకపోయాను" అని చెప్పాడు. అలా కుట్రాళీశ్వరన్ గురువుని మించిన శిష్యుడని కూడా అనిపించుకున్నాడు.

కుట్రాళీశ్వరన్ తండ్రి రమేష్ ఓ న్యాయవాది. తల్లి చిన్నతరహా వ్యాపారాన్ని నిర్వహిస్తోంది. కుట్రాళీశ్వరన్‌కి ఓ సోదరుడు వున్నాడు. అతని తాతయ్య స్వామినాథన్ మనవడి ఘనవిజయాన్ని చూసి మురిసిపోతూ ఎంతో సంతోషిస్తున్నాడు.

## విజయగర్వము లేదు

చిన్ని కుట్రాళీశ్వరన్‌కి తాను సాధించిన విజయానికి గర్వపడడం తెలియదు. కాని అతనికి ఓ పని పూర్తిచేయడముతోనే తీరదే. తాను కోరుకున్నది సాధించాక, తర్వాత ఏం చేయాలనే విషయముపైనే అతనికి ఆసక్తి వుంటుంది. మద్రాసులోని [illegible] హయ్యర్ సెకండరీ స్కూల్లో ఏడవ తరగతి చదువుతున్న కుట్రాళీశ్వరన్ స్కూలు నుంచి ఇంటికి చేరాక పత్రికలు తిరగేస్తూ, సరదాగా కాలక్షేపము చేస్తూ తన ధ్యాసలో తానుంటాడు.

పాక్ జలసంధిని ఈది ఒడ్డుకు వచ్చాక కుట్రాళీశ్వరన్‌ని చూసి కొందరు ఎంతో సంతోషముగా తమ చేతిలో ఏది ఉంటే అది అతనికి కానుకగా ఇచ్చారట. మరికొందరు ఇవ్వటానికి ఏమీ కనపడక తమ దగ్గరున్న డబ్బు తీసి అతని చేతిలో పెట్టారట.

ఓ చిన్నపిల్లవాడు అంతమందిలో భావావేశాలు పెల్లుబికేటట్టు చెయడము ఆశ్చర్యము కలిగించింది" అంటున్నాడు కుట్రాళీశ్వరన్ తాతయ్య

## అత్యద్భుతమైన ప్రాచీన కట్టడాలు

హనుమంతుడు పర్వతాలను పెకిలించగలడని, భీముడు మహా వృక్షాలను సైతము అవలీలగా ఎత్తివేయగలడనీ మన పెద్దవాళ్ళు చెపుతుంటే వింటూ ఉంటాము. వందలాదిమంది దృఢకాయులు కష్టపడి మోసుకొచ్చిన 'శివధనస్సు'ను శ్రీరాముడు సునాయాసముగా ఎక్కుపెట్టిన సంగతి విని అబ్బురపడతాము. పురాణేతిహాసాలలో వారిగురించి చదవడమే తప్ప వారిని చూచిన వారెవరూ లేరు. కానీ మన పూర్వీకుల నిర్మాణ కౌశల్యాన్ని స్పష్టపరిచే కట్టడమొకటి లండన్‌లో వుంది. ఈ కట్టడంలో యాభయిటన్నుల బరువుండే రాళ్ళు వృత్తాకారములో అమరి వుంటాయి. టన్నులకొద్దీ బరువున్న ఈ రాళ్ళు ఉన్నఫళముగా ఇక్కడికెలా ఊడిపడ్డాయనేది అంతుచిక్కని విషయము. వృత్తాకారములో ఉన్న ఆ మరికకే 'స్టోన్ హెంజ్' అని పేరు

క్రీ.పూ. 1800 సం॥లో నిర్మితమైన ఈ కట్టడము 'శాలిస్‌బరీ' నగరానికి 8 మైళ్ళ దూరములో వుంది. 1919లో జరిపిన కొన్ని త్రవ్వకాలలో దొరికిన ఆధారాల ద్వారా ఈ రాళ్ళు అక్కడికి 18 నుంచి 24 మైళ్ళ దూరములో వున్న 'మార్ల్‌బోర్'నుంచి తీసుకుని వచ్చినవని కనుగొన్నారు. నిపుణుల లెక్కల ప్రకారము రోలర్సుమీద ఒక రాయిని అక్కడకు చేర్పించడానికి 1500 కూలీలు 7 వారాలపాటు కష్టపడవలసి వుంటుంది. ఈ విధముగా మొత్తము పనిపూర్తిచేయడానికి అయిదున్నర సంవత్సరాలు శ్రమించాల్సి వుంటుంది. ఈ రాళ్ళను పడవలమీద తెప్పలమీద ఇక్కడకి తెచ్చి వుండవచ్చునేది మరో ఆలోచన. కానీ ఈ మార్గములో రెండుమైళ్ళ అదనపు ప్రయాణభారము పడుతుంది. 1954లో

బి బి సి. టెలివిజన్ సర్వీస్‌వారు ఈ ఊహయొక్క సంభావ్యతను ప్రయోగాత్మకముగా పరిశీలించారు. కాంక్రీట్‌తో చేసిన టన్నుల బరువు వున్న రాళ్ళను-తెప్పలపైన, చెక్కలతో చేసిన రోలర్స్‌పైన, స్లెయిడ్ల సాయముతోనూ నడిపారు. తొలి ప్రయోగ గుణాంకాల ప్రకారము ఒక టన్ను బరువుగల రాతికి 16మంది కావలసి వుండగా, అత్యంత బరువయిన "ఆల్టర్‌స్టోన్"ను ఈ విధముగా ఇక్కడికి చేర్చాలంటే 10మంది ఒకేసారి పట్టిలాగాలట. ఈ విధముగా ఎన్నో సంవత్సరాలు శ్రమించిన మన పూర్వీకులు ఈ ప్రదేశాన్ని సూర్యుని పూజించడానికి ఆలయముగా వాడేవారని పురాతత్త్వ శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు.

## చంద్రగ్రహణ సంబంధము

వృత్తాకార రాతి నిర్మాణాలకు ఇవతలే బాహ్యవృత్తము చేరుకోకుండానే 288 అడుగుల వ్యాసముతో 56 గోతులు వున్నాయి. ఒక్కొక్క గోయి 46 అంగుళాల లోతులో 70 అంగుళాల వెడల్పును కలిగి వుంటుంది. "ఆబ్రేహోల్స్" అనే ఈ గోయుల నిర్మాణానికి మూలకారణమేమిటో ఇంతవరకూ తెలీదు. అయితే ఈ 56 గోతుల ద్వారా చంద్రగ్రహణం ఎప్పుడు వచ్చేది తెలుసుకునేవారని జెరాల్డ్ హాకిన్స్ చెపుతున్నారు. ఒకే అక్షాంశముపై భిన్న ప్రదేశాలలో ఉదయాస్తమయాలు జరిగినా 56 సంవత్సరములకోసారి చంద్రుడు తిరిగి మొదటి స్థానాన్ని చేరతాడు అనే సిద్ధాంతము పూర్వీకులు ఆచరించి వచ్చారని వీరు భావిస్తున్నారు. ఒక్కొక్క రాయిని సంవత్సరానికోసారి గడియారము ముల్లు దిశలో ఒక గోతిలోంచి మరొక గోతిలోకి వేస్తూ వృత్తాన్ని పూర్తిచేసేవారు. ఈ పద్ధతిని అవలంబించే ఆనాటి మతాధికారులు, వైజ్ఞానికులు వాతావరణము అధ్యయనము చేయటానికి పంటలు వేయడానికి సరయిన సమయము నిర్ణయించేవారని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు.

★ ★ ★

Cont....4rd Cover